# తొలి మాట

ఇంపుసొంపులకు పేరొందిన ఇటాలియన్
భాషకు కూడ ఎక్కిన మిక్కిలి మంచికథ



తూర్పు ఇటాలియన్ భాష అనిపించుకొన్న
తెలుగులోకి ఇదిగో ఇప్పుడే వచ్చింది.



సామాన్య సంఘటనతోనే అసామాన్యమైన
శిల్పం కూర్చుకొని ఉల్లాలను పల్లవింపజేసే
అమోఘమైన కథ



మూలానికి దీటుగా, ముద్దులొలికే భాషలో
ముమ్మూర్తులా మూలమే అనిపించే అనువాదం

# నిమజ్జనం

*[ IMMERSION ]*



రచన :

## మంజేరి యస్. ఈశ్వరన్

అనువాదం :

## వేమరాజు భానుమూర్తి



ప్రకాశకులు :

యం. శేషాచలం అండ్ కంపెని,

మచిలీపట్టణము - మద్రాసు - సికింద్రాబాదు

వెల. రు. 1/50

# అసలు కథకుణ్ణి, కథానికను గురించి

దక్షిణభారత భాషలకూ, రచయితలకూ పాశ్చాత్య దేశాలలో సైతం పుష్కలంగా కీర్తిని ఆర్జించిపెట్టిన కథకత్రయంలో శ్రీ మంజేరీ ఈశ్వరన్ గారొకరు.

మాటలను ఆచి తూచి వాడడం, అల్పాక్షరాలతో అనల్పార్థాన్ని వ్యక్తం చేయడం ఆయన విశిష్టత.

మానవ స్వభావపు లోతుపాతులను అవగాహన చేసుకొని, సామాన్య మానవుల స్వరూప స్వభావాలకు చైతన్యస్ఫూర్తితో మూర్తి కల్పనచేసి, తాను కనపడకుండానే తన భావాలను పాఠకుల మనస్సులకు హత్తింపజేయగల మహాకథకుడు ఆయన.

ఆ కథక శిఖామణి దృష్టి ఎంతో సునిశితమైనది. ప్రకృతి పోకడలను బాగుగా పరిశీలించినవాడు కనుకనే సమస్త చరాచర ప్రకృతికీ ఆయన రచన మణిముకురం అయింది. మానవుడు ఏవిధంగా ప్రవర్తించినా అది 'ఈశ్వరుని' కంటపడకపోదు. ఎక్కడ, ఎట్టి విచిత్ర శబ్దం వెలువడినప్పటికీ అది ఆయన చెవి దూరకపోదు. తన బాధను లోకం బాధగా చేయక, లోకం బాధను తనదిగా చేసుకొని, వాస్తవ పరిస్థితులకు మెరుగులు దిద్దేటట్లు వడివడిగా, విడివిడిగా ఆయన తన రచనలను సాగించుకొంటూపోతాడు. అందులో అడుగడుగునా మనకు ప్రత్యక్షమయ్యేది మన సమాజమే. ఇతరుల అనుభవంవల్ల ఉత్తేజం పొంది, స్వీయకల్పనతో దానికి మెరుగులు పెట్టి, భావప్రపూర్ణమైన రసనిష్యంది శైలితో పాఠకులకు తన పాత్రలను పరిచయంచేయగల ప్రజ్ఞ ఆయన సొత్తు. కనుకనే ఆయన రచనలు మామూలు కథలవలె ఒకసారి చదివి పారవేసేవీ కావు; పారవేయవలసినవీ కావు. శైలి సరళ మనోహరమైనదైనా, భావ గాంభీర్య పటిమవల్ల చదివిన వారందరూ పుస్తకం మూసినతరువాత కూడ రచననుగురించీ, రచయితను గురించీ కొంచెంసేపయినా ఆలోచింపక తప్పదు.

కడప.

# ఏముంది ఇందులో?

ఇప్పు డిక ఈ కథనుగురించి. ఇది ఈశ్వరన్ రచించిన చిన్న కథల్లోకల్లా పెద్దకథ. ఇందులో ఆయన మధ్యతరగతి సంసారాల్లో సర్వసాధారణంగా జరుగుతూవుండే ఒక చిన్న సంఘటన—తండ్రిగారి అస్థికలను గంగలో నిక్షేపం జేయడానికి పెద్దకొడుకు సతీసమేతంగా కాశీయాత్ర చేయడం—ఇతివృత్తంగా స్వీకరించాడు. ఇందులో ఇంత పెద్ద కథ వ్రాయడానికి ఏముందని అందరూ అనుకోవచ్చు. కాని, కథకుడైన ఈశ్వరన్ చేతిలో ఆ సామాన్య సంఘటనే అసామాన్యమైన ఇతివృత్తంగా భాసిల్లింది. మనలో చాలామందికి ఆ సంఘటనలోని అందం, చందం, ఉత్తేజం, ఉద్బోధ, వ్యంగ్యం తెలియవుకాని మొదటనుంచీ చివరకంటా ఒకసారి చదివేసిన తరువాత కథాశిల్పాన్నీ, కథనాన్నీ, దానిలో గర్భితమైన ఇతర ఆకర్షణలనూ అన్వేషించుకొంటూ మఱల మఱల చదవాలనిపిస్తుంది. అది చాలు, కథకుని కృషి సఫలమైందనడానికి. ఇది ఇటాలియన్ భాషలోకి కూడ అనువాదమై ఆదరణ పొందింది. ఏమీ లేకుండా ఈ మన్నన పొందడం మాటలా?

ఈశ్వరన్ కథలు చెప్పడంలో అనేక రకాల ప్రయోగాలు చేశాడు. అన్నిటిలోనూ తాను ఆశించినదాన్ని సాధించగలిగాడు. ఆయన పద్యం వ్రాసినా, పాట అల్లినా, కథకట్టినా అందులో వెనుకటి తరాలవారి వివేకమూ, వారి మూర్ఖత్వంతోబాటు వర్తమానపు వైవిధ్యమూ, చిత్తచాంచల్యమూ కూడ కొట్టవచ్చినట్లు కనపడతాయి. ఆయన రచనలు చదివినవారందరి మనస్సులలోనూ కల్లోలాన్ని రేకెత్తించి జీవిత పరమావధిని గురించి ఆలోచింపజేస్తాయి.

ఈశ్వరన్ నీతికి ప్రాధాన్యమిస్తాడు. కాని, నీతి పేరుతో చేతులు ముడుచుకొని కూర్చోమని చెప్పడు. జీవితాన్ని ధైర్యంగా, హుందాగా, సదసద్వివేకంతో ఎదుర్కోవలసిందని హితబోధ చేస్తాడు.

ఆయనకు 'అధికార రోగపూరిత బధిరాంధక శవాలు' అంటే గిట్టదు. కళ్ళుండీ కానలేనివాళ్ళనీ, చెవులుండీ వినలేనివాళ్ళనీ, కాళ్లుండీ నడవలేనివాళ్ళనీ, బుద్ధివుండీ ఉపయోగించలేనివాళ్లనీ, సోమరులనూ చూస్తే ఆయనకు వళ్ళుమంట. వారిని నిర్దాక్షిణ్యంగా చీల్చిచెండాడు

తాడు. మెడబట్టి నిలబెట్టి వారిలోని లోపాలను ఎత్తి చూపించి అపహాస్యం పాలుచేయడం ఆయనకు సరదా. ఈ సందర్భంలో ఆయన చేతిలో మాటలు ఎంతో శక్తివంతమైన ఆయుధాలుగా ఉపకరిస్తాయి.

ఆయన సమాజంలోని కుళ్లునీ, దౌర్జన్యాన్నీ, మానవునిలోని బలీయమైన విషయవాంఛలనూ చూచి, బెదిరిపోక, మానవజాతి అభివృద్ధికి ఆటంకంగాఉన్న భౌతికవాదాన్ని, నిర్లిప్తతనూ, నిర్లక్ష్యాన్ని అసహ్యించుకొంటాడు. ఈ గుణం ఆయన రచనలలో సర్వే సర్వత్రా గోచరిస్తుంది. అంతేకాదు, ప్రపంచంయొక్క వైవిధ్యానికి అచ్చమైన ప్రతిబింబాలు అవి.

ఆయన రచించిన కథలనేకం. 'నేకెడ్ షింగిల్స్', 'యాంగ్రీ డస్ట్స్', 'రిక్షావాలా', 'శివరాత్రి', 'ఫేన్సీ టేల్స్', 'నో యాంక్లెట్ బెల్స్ ఫర్ హర్' అనే పేర్లతో అవి అనేక సంపుటాలుగా వెలువడ్డాయి. అందులో ఒక్కొక్క కథా ఒక ఆణిముత్యం. వాటిలో రచయిత యొక్క అనుకంప, అభిమానం, అభిరుచులు, ఖభిజాత్యం, సునిశితమైన వ్యంగ్యవైభవంకూడ కళ్లకు కట్టినట్లు కనబడతాయి.

ఈశ్వరన్ రచనలలో గల మరొక విశిష్టత ఏమంటే, అవి ఆయన గడుసుతనంతో పండిత, పామర ఉభయరంజకంగా ఉండడం.

ఈశ్వరన్ తన రచనలకు పేరుపెట్టడంలోనే తన ప్రతిభ అంతా ద్యోతకమయ్యేటట్లు చూచుకొంటాడు.

భారతీయ కథానికా రచయితల్లో ఈశ్వరన్ వలె ఇన్నిరకాల ప్రయోగాలు ఇంత శ్రద్ధగా, ఇంత జయప్రదంగా చేసినవారు మరెవ్వరూ లేరేమో! ఈశ్వరన్ స్రష్ట; ద్రష్ట; నైతిక విలువలను బాగా పాటించే మనిషి. 'తానెంతో జగమంత' అన్నట్లు తనవలెనే సకలప్రపంచంఉంటే చాలా బాగుంటుందనుకొంటాడు. కాని, అలాగే ఉండితీరాలని పట్టు బట్టడు. ఆయన పెద్దకథ వ్రాసినా, చిన్న కథవ్రాసినా, జానపదగాథను తిరిగి చెప్పినా అది ఆ మూలాగ్రం మధురంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. అందుకు కారణం శిథిల శిశిరంనుంచి నవ వసంతాన్ని ఆవిర్భవింప జేయగల అనుభూతిని పాఠకులకుఅందించే అపూర్వశక్తి ఆయనలేఖినికిఉండడమే.

- వేమరాజు భానుమూర్తి.

# అనువాదకుణ్ణి గురించి

దేశభాషలలో వైజ్ఞానిక వాఙ్మయాభివృద్ధికి కృషి చేస్తున్న వారిలో సిద్ధులూ, ప్రసిద్ధులూ భానుమూర్తిగారు.

సమకాలీన సాహిత్యాకాశంలో స్వయం ప్రకాశమానుడైన సార్థకనాముడీయన. ఈ నాడు తెలుగుభాషను నేర్చిన వారిలో వానకు తడవని వారూ, ఈయన రచనలను చదివి తనియని వారూ లేరు.

పుష్కలమైన వాక్చమత్కృతీ, మధురమైన మందహాసమూ, సరళ మనోహరమైన శైలీ, నవనవోన్మేషమైన ఉత్సాహమూ, ప్రసన్నమైన కథన కౌశలమూ ఈయనకు సహజలక్షణాలు. చెప్పదలచుకొన్న దానిని చక్కగా, చిక్కగా, చిన్న చిన్న మాటలలో చెప్పడం ఈయన ప్రత్యేకత. పరువూ, బరువూ ఉన్న రచనలు ఈయనవి. అవి ఆపాత మధురమైనవే కాక ఆలోచనామృతమైనవి కూడ.

నిజానికి తెలుగుభాషలోని మార్దవం అంతనీ స్వంతం చేసుకున్న రచనలు ఈయనవి. విషయం ఎంత కఠినమైనదైనా కానివ్వండి. అందరికీ అర్థమయ్యే భాషలో తేటతెల్లమయ్యేటట్టు చెప్పడం ఈయనకు ఆట.

అనువాదంలో అందెవేసిన చేయి ఈయన. పాశ్చాత్యనుడికారపు పడికట్టులను జాను తెనుగులోనికి అనువదించగల నేర్పు అనన్యం. ఈయన అనువదించిన గ్రంథం ఏదైనా ఒకటి తీసుకోండి; అందులో ఎక్కడైనా ఏనాలుగు పుటలైనా తీసుకొని చదవండి. మూలమే తెలుగా అన్నట్టు మనం భ్రమసిపోతాం. అసలులో లేని అందమేదో అనువాదంలో అణువణువునా మనలను ఆకట్టుకుంటూ, మనకు తెలియకుండానే ముందుకు తీసుకుపోతుంది.

భానుమూర్తిగారి అభిరుచులవలెనే ఈయన ప్రజ్ఞ కూడ బహుముఖాలైనది. ఆత్మవిశ్వాసానికి ఈయన మారుపేరు. పత్రికా రచయితగా, చెప్పదలచుకొన్న దానిని సూటిగా, చదువరుల మనస్సులకు హత్తుకొనేటట్టు చెప్పగల సామర్థ్యాన్ని భగవాను డీయనకు అనుగ్ర

హించాడు. ఈ పరిమిత సామర్థ్యంతో ఆంగ్లభాషా పరిచయంలేని తోడి తెలుగువారికి సేవచేయడం ఎలాగా అనే మథనతో వివిధాలైన సారస్వత ప్రయోగాలు ఎన్నో చేశారు. చివరకు దురవగాహములైన వైజ్ఞానిక రహస్యాలను ఆంగ్లభాషా పరిజ్ఞానం లేని తెలుగుసోదరులకు తెలియచెప్పగల సామర్థ్యం తమ లేఖినికి కలదన్న సంగతిని తెలుసుకోగలిగారు. అప్పటినుంచీ పాఠ్యప్రవచనాలకు పనికివచ్చే వైజ్ఞానిక గ్రంథాలను లెక్కకు మిక్కిలిగా రచించి తెలుగు భాషను పరిపుష్టం చేస్తున్నారు.

ఈయన చాలా అదృష్టవంతుడు. చూడగలిగినవారికి ఆ అదృష్టం శతవిధాల దృష్టమవుతూ ఉంటుంది. నిజానికి ఇంత చిన్నవయస్సులో గుణంలో నేమి, వాసిలో నేమి వెలలేని, తులలేని అపార సాహిత్యసంపదను సృష్టించిన ఘనకీర్తి భానుమూర్తి గారిదే. నూనూగు మీసాల నూత్న యవ్వనంలో ప్రారంభించి ప్రౌఢ నిర్భర వయఃపరిపాకం రాకముందే జనసామాన్యంలో వైజ్ఞానిక దృక్పథాన్ని పెంపొందించడం కోసం ఈయన వ్రాసిన గ్రంథాలు అప్పుడే అయిదు పదుల లెక్కకు అధిగమించాయి.

నిత్యనూతనమై పలువిధాలుగా వికసిస్తున్న ఆధునిక విజ్ఞానందశదిశలా విరజిమ్మే ప్రకాశాన్ని, దాని బహుళ ప్రయోజనాలనూ తెలుగు ప్రజలకు తెలియచెప్పాలన్న ఆకాంక్షతో ఈయన ఇప్పుడు 15 సంపుటాల శాస్త్రవిజ్ఞానసర్వస్వం ఒక దానిని సమకూరుస్తున్నారు కూడా.

నిష్కామంగా, నిరాడంబరంగా, నిరహంకారంగా ఈయన సాగిస్తున్న నిరంతరకృషి ఫలితంగా భారతదేశంలో మరేదేశభాషలోనూ వెలువడనన్ని వైజ్ఞానిక గ్రంథాలు తెలుగువారికి లభించాయి. తెనుగు భాషకు ఒదగని భావమే లేదని ఈయనరచనలవల్ల ఋజువైంది. వైజ్ఞానిక, సాంకేతిక విజ్ఞాన బోధకు 'దేశభాషలందు తెలుగు లెస్స' అని ప్రొఫెసర్ జె. బి. యస్. హాల్డేన్ ప్రభృతి పాశ్చాత్య పండితుల ప్రశంసలకు ప్రాతిపదికలు కాగలిగినవి ఈయన రచనలు.

చరిత్ర పట్టభద్రుడూ, చరిత్రకారుడూ అయిన భానుమూర్తి గారు నవ్యాంధ్ర వాఙ్మయంలో క్రొత్తచరిత్రనే సృష్టించారు. ఆధునిక విజ్ఞాన వికాసపు చరిత్రగా శాస్త్రవిజ్ఞాన సర్వస్వాన్ని అలవోకగా రచిస్తున్న ఈ ప్రజ్ఞాశాలే, విశ్వసాహిత్యదర్శినిని కూడా అనువదించారు. ఆంధ్రుల

సాంఘిక చరిత్ర పరిణామాన్ని ఆంగ్లంలో శ్రీమతి సుభద్రకు లేఖలుగా రచించిన భానుమూర్తి గారే పండిత జవహర్‌లాల్ నెహ్రూ రచించిన ప్రపంచ చరిత్రనుకూడ తెలుగులోకి అనువదించారు. అర్థశాస్త్రంలో ఈయన అభిరుచికి నిదర్శనం ఈయన రచించిన 'అర్థం—పరమార్థం' అన్న ఉద్గ్రంథం. అలాగే ఈయన రాజకీయ శాస్త్ర నిష్ణాతత్వానికి ప్రతిబింబం ఈయన రచించిన 'ప్రజలూ—పశువులూ' అన్న పుస్తకం.

శ్రీ భానుమూర్తి గారి సాహిత్య కృషి ఇంతటితో ఆగలేదు. తెనుగులో బాల వాఙ్మయాభివృద్ధికి ఈయన జయప్రదంగా సాగించిన కృషి అనన్యమూ, అపూర్వమూ, గణనీయమూను. పిల్లల అభిరుచులను గమనించి, వారికి తెలిసేటట్టు జిలిబిలి మాటలలో ఎన్నో కథలూ కబుర్లూ చెప్పగలిగిన కథక శిఖామణి ఈయన. అవి అన్నీ త్వరగానే వెలుగు చూసి తెలుగుదేశంలో పాలబుగ్గల పసిపాప లందరినీ ఆనంద పరచనున్నాయి. ఈయనలోని ఆకర్షణ అనిర్వచనీయమూ, అనుభవైక వేద్యమూ అయింది. ఈయన ఎక్కడఉంటే, అక్కడే ఒక 'దర్బారు'. ఈయన ఎంతటి గొప్ప రచయితో అంత మంచి మాటకారి. ఈయన పుస్తకాలూ, ఈయన రచించిన కథ కాని కథలూ, చదువుతూంటే మనలను మనం మరచిపోతాం. ఈయనమాటలు వింటూంటే ఆ కాస్సేపూ మనం మనకు తెలియకుండానే ఏదో లోకంలోకి వెళ్ళిపోతాం. మిత్రుడూ, మిత్రసులభుడూ అయిన ఈయన పెద్దవాళ్ళతో జటిలమైన శాస్త్రచర్చలూ సాగించగలడు; అంతలోనే పిల్లలు కనబడితే వాళ్ళలో ఒక్కడుగా మారిపోయి వారి ఆటపాటలలో లీనమై పోనూగలడు. ఈయన 'మాటకచ్చేరీ' 'పాటకచ్చేరీ' కంటే ఎంతో ఆహ్లాదకరమైనది. భానుమూర్తి గారిని గురించి మేము చెప్పవలసిందీ, చెప్పదలచిందీ ఇంకా ఎంతో ఉంది. కాని,

'ఈశ్వర' కథాసాగరాన్ని భానుమూర్తి గారు ఎంత చక్కగా అనువదించారో ఇంకొక్క క్షణంలో చదివి ఆనందించబోతున్న మీకు ఇంక ఏమి చెప్పినా పక్షపాతంగా తోచవచ్చు. అలాగని నిజాన్ని చెప్పకుండా ఉండడం ఎలా ? ఈ 'నిమజ్జనం' రానున్న 'ఈశ్వర' కథా సాగరానికి వాచవి మాత్రమే.

ప్రకాశకులు.

# నిమజ్జనం

## ఒకటి

ఎద్దులబండి మెల్లిగా ముందుకు సాగుతోంది. చైత్ర మాసం. పేరుకి వసంతకాలమే అయినా గ్రీష్మచ్ఛాయలు గోచరిస్తున్నాయి. ఆ రాత్రి చంద్రోదయమింకా కాలేదు. నక్షత్రాల గుడ్డివెలుగులో అగాధంలోకి చొచ్చుకుపోతున్నట్లున్న పుంత వెంబడే బండి ముందుకు సాగిపోతోంది. బాటకు ఇరువైపులా పనసచెట్లు, మామిడిచెట్లు, చింతచెట్లు, మధ్య మధ్య ఊడలుదిగిన మఱ్ఱిచెట్లు దడి కట్టినట్లున్నాయి. ఆ వేళప్పుడు వీచే చల్లని మెల్లని పిల్లగాలులకు అవి అన్నీ తల లూపుతున్నాయి. నాటుదారి అడుగడుగునా గతుకులే. ఒకొక్కచోట పాములాగా వంకరలు తిరుగుతోంది. మరొకచోట మైదానంలోపడి, ప్రక్కనఉన్న చేలల్లోంచి చుట్టూ గుట్టలుదాటి దిగ్వలయంతో ఏకమైపోయినట్లు కన బడుతోంది. కోతలూ, కుప్పనూర్పులూ ముగిసి పంట

మాసూలైపోయింది. మిగిలిన దుబ్బులు భొమ్మసిపాయిల వలె బారులుతీరి నిలిచిఉన్నాయి. అల్పబుద్ధుల అధికార దర్పంవలె వాటి ఎగురుఅంతా రేపోమాపో మళ్ళీ దుక్కి-దున్నినప్పుడు మట్టిలో కలిసిపోయేవరకే. జిల్లేళ్ళు, తంగేళ్ళమధ్య జల్లెడవంటి చిల్లులతో కార్మికుల తాటాకు గుడిసెలు గొగ్గిపళ్ళవరసవలె చూపరులకు బాధాకరంగా కనబడుతున్నాయి. ఆరోడ్డుచివర పేదకొంపలతరువాత ఒకే ఒక పెద్ద పెంకుటిల్లు, దానిచుట్టూ దొడ్డి, ఆ దొడ్డిలో మల్లెతీగలు, గులాబీ మొక్కలు చాలాఉన్నాయి. ఆ ఇంటిముందు పెద్ద పందిరి. ఆ పందిరిమీదకు ఎక్కి అన్నివైపులకూ గుబురుగా అల్లుకున్న పువ్వులతీగలూ, ఆ దొడ్డిలో అక్కడక్కడ పడి మొలిచిన అడవి మొక్కలూ రంగురంగుల పువ్వులూ ఆ చీకటిలో వింతవింత శోభలీనుతున్నాయి. సహ్యాద్రినుండి బయలుదేరిన మలయపవనం ఒకటి పడమటి సముద్రంమీదుగా వచ్చిన జలపవనాన్ని మృదువుగా తాకింది. వీటి కలయిక పరస్పరాలింగనంలో పరవశులై మృదుల స్పర్శాజనితమైన మధురానుభూతులతో కరగిపోయే ప్రేయసీప్రియుల మనోభావములవలె, లేతకొబ్బరి నీటివలె స్వాదిష్టంగా సుఖోపభోగ్యంగా ఉంది. ఆ రాత్రి శోభ అపూర్వమైంది. అపూర్వసంఘటనలు జరుగదగు కాలం అది. ఆ రాత్రి ప్రకృతి పోకడలు అనూహ్యములు. అమృతమే వర్షిస్తుందో, హాలహాలమే చిలికిస్తుందో! ఏమో! ఆ ధోరణిచూస్తే ఎవ్వరికీ అంతు బట్టడంలేదు.

బండివాడు మెల్లిగా అదలించాడు. ఎద్దులు కొంచెం జోరుగా అడుగులువేశాయి. అవి రెండూ ఎంతో అందమైనవి. ఒకటి ఎఱ్ఱది. రెండోది కఱ్ఱది. వాటి గంగడోళ్ళు శ్రీమంతుల ఇంటిలో తాళవృంతాలవలె అటూ, ఇటూ ఊగుతున్నాయి. వాటికొమ్ములు కటారులవలె వాడి మొనలతో వంకర తిరిగి ఉన్నాయి. వాటి చివర అందంగా ఇత్తడిగోపురాలు, వాటికి వ్రేలాడే రంగు రంగుల కుచ్చులు, పచ్చపూసలూ కలిపికట్టిన దండలూ, వాటిమధ్య దృష్టి దోషపరిహారార్థం కట్టిన తెల్ల తామెత్తులూ మొత్తానికి చూడముచ్చటగా ఉన్నాయి. అవి ఎద్దులంటే ఎద్దులా! నందులుకాని. వాటి అందం చందం అంతా అపూర్వం. అవి ఒక్కొక్కసారి తరాటుతీసాయి. ఇంకొక్క సారి నెమ్మది నెమ్మదిగా తాపీగా గంభీరంగా నిర్లిప్తంగా నడుస్తుంటాయి. అవి మంచి వయస్సుమీదనున్న కోడెలని వాటిని చూడగానే చెప్పివేయవచ్చు. కొత్తగా విత్తులు కొట్టారు. మెడమీద కాడి కొత్తగా పండిందనడానికి నిదర్శనం కాయలు అంతగా కట్టకపోవడమే. మంచి హుషారుగా ఉన్నాయి. వాటికి పౌరుషమింకా చావలేదు. చేవమీద ఉన్నాయేమో అదలించేసరికి ఆమడదూరం పరుగు తీస్తున్నాయి. వాటికి పూన్చిన బండి భారాన్ని అవి లెక్కచేస్తున్నట్లే లేదు. వాటి వెనువెంటనే బండి గుడ్డిగా దొర్లుకుంటూ వచ్చేస్తున్నది. కాని ఆబండితోటే అబ్బికి అవే జీవనాధారం. బండితోలి పొట్టపోసుకుంటూ ఉంటాడు.

వాటి సంపాదనమీదే కుటుంబమంతా జరగాలి. ఇందుకు ప్రతిఫలంగా వాటికి ముట్టేది ఉన్నప్పుడు పచ్చగడ్డి, లేనప్పుడు ఎండుగడ్డి, అడపా దడపా పట్టెడు కొబ్బరిపిండి. ఆనాడు వాటికి నిజంగా పండుగే. ఇక చేసేదేముందన్నట్లు ఎద్దులు అలా మెల్లగా ముందుకు సాగుతూనే ఉన్నాయి. వాటిమెడలో కట్టిన మువ్వల పటకాలో కంచుగంట గణ గణ మంటూంటే వినబడే శ్రావ్యనాదం శ్రుతిగా బండి వాడు పల్లెటిపాట ఏదో పాడుతున్నాడు. మధ్య మధ్య అనునాసికంగా హేహే అంటూ ఎద్దులను ఆపేక్షతో అద లిస్తున్నాడు. ఆ మువ్వలసవ్వడి, చక్రాలరాయిడీ, బండి వాడిపాట, పాటమధ్య అదలింపులూ అన్నింటితో ఆ నిశీథపు నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ బండి ముందుకు సాగిపోతోంది. తనపాటలో తానే తన్మయమైపోయిన బండివాడు ఆకాస్సేపు అవి ఎద్దులన్న సంగతినే మరచిపోయినట్లున్నాడు. హుషా రుగా మీదిమీదికి మరీ ముందుకు వంగి వాటి మూపురా లను ముద్దుపెట్టుకున్నాడు. బండిఅబ్బికి పట్టుమని పాతికేళ్ళు లేవు. కండలు తిరిగిన దండలు, ఆజానుబాహుడు. గ్రామీణ సౌందర్యమంతా పోదివిపోసిన పోతవిగ్రహం. వంశపారంపర్యమైన ఆరోగ్యపు అందచందాలు కొట్టవచ్చి నట్టు కనబడతాయి. అవయవాల కదలిక అమోఘం. బాల్యమంతా పశువులశాలల్లోనే గడచిపోయింది. ఎద్దులకు చాకిరీలోనే మనిషి ఏపారినవాడు. చిరుతపులివలె చెంగున లంఘించగల లాఘవమూ, పౌరుషమూ కలవాడే కాని

క్రూరత్వ మెరుగడు. కనుక ఆ ఎద్దులు బ్రతికిపోయాయి. తొట్టెలోకూర్చుని తోలుతున్న కాసేపు అతని ఆనందా నికి అంతులేదు. అది అలేఖ్యం. అనుభవైకవేద్యం. తన ఆజ్ఞ సర్వత్రా పాలింపబడేటప్పుడు రాజులకు, రారాజులకు కలిగే ఆనందంవంటిది అది. వయస్సులోఉన్న వన్నెకాడు. అయినా పల్లెపాటలు అతనికి వచ్చినన్ని ఇంకెవ్వరికీ రావేమో. ఇనుపపట్టాలు బిగించిన బండిచక్రాలు, అడ్డం తగిలిన రాతిముక్క లన్నింటిని పిప్పిచేసుకుంటూ బాధతో మూలిగే రోడ్డువిడిచే నిట్టూర్పులో అన్నట్టుగాఉండే రేగిన ధూళిని లెక్కచేయకుండా బండగా ముందుకు సాగుతూంటే సంతోషం పట్టలేక కమ్మకమ్మని పాటలెవో గొంతెత్తి మధురాతిమధురంగా పాడేవాడు. ఉన్నట్టుండి ఏ ప్రేమ పాటో లంకించుకునేవాడు. మసకచీకట్లలో, ముసిరిన వలపుతలపులతో మురిసిపోతూండే పల్లెజంటలు, సమయ మెరిగి, సంకేతమెరిగి అనుకున్నప్రకారం, అనుకున్నచోట కలుసుకో గలిగినప్పుడు పొందే అవ్యక్త ఆనందానుభూతిని వ్యక్తంచేసే పాటను చిత్రవిచిత్రమైన బాణీలలో పాడేవాడు. ఇంత జరుగుతున్నప్పటికీ ఆ నిశీథప్రకృతి తన వైఖరిని ఇదమిత్థమని నిర్ణయించుకున్నట్లు లేదు. అంతలో ఏమి తోచిందో ఏమో గొంతుక తగ్గించుకొని బండిగూడు కాస్త ఒత్తిగించి లోనికి తొంగిచూచాడు. ఆ చూడడంలో తన ధైర్యానికి తానే ఆశ్చర్యపడిపోయాడు. ఇంతలో రెండు రకాల ఉచ్ఛ్వాసనిశ్వాసలు అతనికి వినబడ్డాయి. ఒకరేమో

మెల్లిగాను, ఇంకొకరేమో గట్టిగాను ఊపిరి తీసుకొంటున్నట్టు అనిపించింది. ఆ బండిలో ఉన్నది ఇద్దరే. ఒకరేమో మోకాళ్ళమీద గడ్డం ఆన్చుకుని ముడుచుకొని కూర్చున్నట్టు, ఇంకొకరేమో తడికకు ఓరగా జారగిలబడి కూర్చున్నట్టు; మసక మసకగా కనపడింది. లోపల కూర్చున్నవారిని బాగా చూడడంకోసమో అన్నట్లుగా అగ్గిపుల్ల వెలిగించాడు. అంతలో లోపల కూర్చున్న నీడకు ప్రాణం వచ్చి కదలి నట్లగుపించింది.

"ఎవరది?" అని అధికార స్వరంతో కర్కశంగా ప్రశ్నించాడు.

"నేనేనండి బాబయ్యా, చుట్ట ముట్టించుకుంటున్నా."

"ఓ అలాగా!"

అంతగా అతికేటట్టు చెప్పిన ఆ అబద్ధంముందు నిజం నిలవలేకపోయింది. అది పురుషకంఠం. దేన్నిగురించో ఆదుర్దాగా అడుగుతోంది.

"అది జాగ్రత్తగా ఉందా?"

"ఆహా!" అన్నాడు. బండివాడు ఇంతకీ చుట్ట ముట్టించనేలేదు. ఆ వెంటనే మరోపాట ఎత్తుకున్నాడు. అసలుసంగతి దేనినో జ్ఞాపకం చేసుకుంటున్నట్టు అనుకూల రాగం గుండె గొంతుకలో కొట్లాడుతుంటే ఆహ్వానిస్తున్నట్టు అవ్యక్త రాగాలాపన అందుకున్నాడు.

పువ్వెప్పుడు పూస్తుంది?
మధుపముతో కూడి
మధువు మనసార
తాగగలిగే దేవేళ?
కన్నెపిల్లకు
పన్నెండేళ్ళు
సున్నితంగా
నిండేదెప్పుడు?
నవ్వినప్పుడల్లా
గులాబీబుగ్గలపై
మలచే బుల్లిసొట్టలు
పలికే ప్రణయపుపాటలకు
పలుకులూ కులుకులూ
బెళుకులూ తళుకులూ
అందించే సందేశాలకు
సుందరరూపం ఆ సురుచిర దేహం.

ఆహా! యవ్వనమెంత గొప్పది? దానిమాట చెబితేనే మైకం కమ్ముతుంది. ప్రణయాన్ని పడుగుగానూ, ఆకాంక్షలను పేకగాను పేర్చి జీవితంచుట్టూ ఇంద్రధనస్సులను అల్లుతుంది. దాని ప్రభావం అమోఘం. వియోగ దుఃఖాలు ఉన్నవారికి క్షణం యుగంగా తోస్తే సంయోగ

సుఖంలో యుగం క్షణంగా చెల్లిపోతుంది. బండి తోలే వాడు బలే హుషారుగా ఉన్నాడు. ఆ మత్తులో అతనికి అంబరమే అందుబాటులోకి వచ్చినట్లనిపించింది. చేతిలో చరణాకోల ఆకాశపు అంచులకు విసిరి దాని కొనలకు చుట్టుకున్న నక్షత్రాలను దివినుంచి భువికి దిగలాగి తన చేతి వేళ్ళకు, తన ప్రియురాలి చేతివేళ్ళకూ ఉంగరాలలో పొదిగి పెట్టాలని ఆశపడుతున్నాడు.

"పువ్వెప్పుడు పూస్తుంది?" మహోత్సాహంతో మళ్ళీ మళ్ళీ అదే చరణాన్ని ఆలాపిస్తున్నాడు. అలాంటి పాటలవెనుక తొంగిచూచే ఆశాసౌధాలు అలాగే ఉండిపోతే ఎంత బాగుంటుంది! ఆ ఆదర్శ సుందరికోసం అలాగే అలాగే అనంతంగా ఆశగా ఎదురు చూస్తుంటే...కాని ఏం చెప్పను? ఆదర్శసుందరికోసం అటమటించిపోతూ కనే సుందర స్వప్నాలకూ, ఆడదాని స్పర్శకోసం అంగలారుస్తూ అణువణువునా వేగిపోతుండడానికీ అంతర మెక్కడ?

---

# రెండు

దోవలో తాను కొంచెం సేపు కునుకు తీసినట్లు అఖిలేశ్వరుడికి తెలియనే తెలియదు. ఇప్పుడు మాత్రం మనిషి బాగా మెలకువ లోనే వున్నాడు. తన ప్రక్కనే పడుకొని నిద్రపోతున్న అర్ధాంగి మీదకు వంగి చూచాడు. ముడుచుకొని ఉన్న ఆమె కాళ్ళను సాగదీశాడు. తాను నిద్రపోయినప్పుడు తనవళ్ళో నుంచి జారిన ఆమె తలను తిరిగి తొడమీద పెట్టుకున్నాడు. ఆమె నిట్టూర్చింది. వళ్ళు విరుచుకుంది. నిద్రలేపినట్లున్నానే అనుకున్నాడు. ఇంతలో మళ్ళీ చూచేసరికి ఆమె యథాప్రకారం సుఖనిద్రలో మునిగిఉంది. సరే అనుకున్నాడు. మనస్సు పరిపరివిధాల పోతోంది. ఎన్నెన్నో ఆలోచనలు సముద్రతరంగాలవలె వచ్చిపడుతున్నాయి.

"ఇంతకీ మనం ఇప్పుడెక్కడ ఉన్నట్లు?" అని బండి వాడిని ప్రశ్నించాడు. ఏదో మాట్లాడకతప్పదన్నట్లు.

"గొడుగురాయిని దాటిపోయాంబాబూ" అన్నాడు బండివాడు. ఆ మాట విన్నంతనే అతని ఆలోచనలు పెడ దారిని పడ్డాయి. నిజమే. గొడుగురాయికి ఆ పేరు రావ డానికి వెనుక చాలా గాథ ఉంది. ముక్కాలిపీటలా ఉంటుంది. మూడు ప్రక్కలా మూడు స్తంభాలు. వాటి

మీద బోర్లించిన గుండ్రనిరాయి. ఈ గొడుగురాయి ఒక చెలక మధ్య ఉంది. దానికి సంబంధించిన స్థల పురాణం ఇది. ఒకానొక బ్రాహ్మణుడు తీర్థయాత్రల నుంచి తిరిగి వస్తూండగా, దోవలో వరిమళ్ళలో పనిచేస్తున్న ముగ్గురు హరిజనస్త్రీలు కనబడ్డారట. ఊడ్పుల రోజులవి. పని ముమ్మరంగా సాగుతున్నప్పుడు ఎండకీ, వానికీ కాపుగా ముగ్గురూ మూడు తాటాకు గొడుగులు తలకు తగుల్చుకున్నారట. ఈ గొడుగులు చాలా పెద్దవేమో వారి వీపులు కూడా చూపరకు కనబడకుండా పోయాయి. వారేమో అస్పృశ్యులు. అవాచ్యులు. కంట బడరానివారు. వారి మాట వినబడరాదు. ఇందులో ఏది జరిగినా బ్రాహ్మణ్యం బండపాలవుతుందామెను. శ్రోత్రియం కాస్తా పోతుంది. బ్రతుకు కుక్కముట్టుకున్న కుండ వతుగా మైల పడిపోతుంది. అందుకని "అసింటా! అసింటా" అంటూ అరచుకుంటూ వస్తున్న బ్రాహ్మడి కేకలను వినీకూడా ఈమాలపడుచులు లెక్కచేయకుండా తామేమో, తమ పనేమోగా ఆ పొలంలో అలాగే ఉండిపోయారు. బ్రాహ్మణుడికి కోపం ఆగలేదు. ఆ ఆవేశంలో వాళ్ళు ముగ్గురూ అలాగే రాతి బొమ్మలుగా మారిపోవాలని శాపమిచ్చాడు. అంతే! ఆ ముగ్గురూ నిలుచున్న నిలుచున్నపాటుగా వాళ్ళ గొడుగులతో సహా రాళ్ళుగా మారిపోయారు. కాని, శాపమో, పాపమో ఏమైతేనేమి వాళ్లు ముగ్గురూ విడివిడి

గానేడున్నా, వాళ్ళ గొడుగులు మాత్రం చిత్రంగా ఒక్కటై పోయాయి!

అఖిలేశ్వరుడు చిన్ననాట ఈ కథను చాలాసారులు విన్నాడు. అదంతా అతని మనస్సులో ఒక్కసారి నెమరుకు వచ్చింది. ఈ గొడుగు రాయికీ తన ఊరికీ మూడు క్రోసులదూరం. ఆ చోటు అతనికి బాగా సుపరిచితమైంది. అయితే ఆ సమయంలో ఆ కథ నిజా నిజాలను అతను తర్కించ దలచుకోలేదు. ఇలాంటి జానపద గాథలన్నీ కట్టుకథలలా కనబడినప్పటికీ, అవి గ్రామీణుల మూఢ భక్తి, అజ్ఞానం ఆధారంగా అలా అలా వ్యాప్తిలోకి వచ్చేస్తాయి. నిశితమైన తర్కానికి అవి ఆగలేవు. ఇలా ఏవేవో ఆలోచించుకుంటూ ఉండగా అతని మనస్సు మరిన్ని ముఖ్య విషయాలమీదకు మళ్ళింది.

"కొంచెం ఆపవోయ్!" అఖిలేశ్వరుడు హఠాత్తుగా బండివాణ్ణి అడిగాడు. పాట తన్మయత్వంలోపడి వాడీ లోకంలో ఉంటేగా మాట్లాడడానికీ, జవాబు చెప్పడానికీ! వాడి ఊహలు ఇప్పుడిప్పుడే స్వర్గపు పొలిమేరలు చేరుకుంటున్నాయి.

"నే చెప్పేది వినబడిందా? నీకే" అన్నాడు కొంచెం గట్టిగా.

"హుఁ"

"కాస్త ఆపవయ్యా! ఆపుతావా? లేదా?"

"వీల్లేదు. ఇప్పుడే మనం ఎత్తు ఎక్కుతున్నాం. ఇప్పుడు పగ్గాలు బిగబట్టామంటే ఎద్దులకు బాధ అవుతుంది బాబూ!"

బండివాడు మెల్లగా ఉన్నమాటేదో చెప్పేశాడు. అందులో అవినయమేమీ లేదు.

ఇంతలో బండి పల్లానికి దిగుతుందన్న సంగతిని అఖిలేశ్వరుడు తెలుసుకోగలిగాడు. చక్రాలు చకచకా దొర్లుతున్నాయి. కాడి కిర కిర మంటోంది. ఏదో మాట్లాడాలనుకుంటూంటే, అడ్డం వచ్చినట్లుగా బండివాడే మాట్లాడాడు.

"మీ రెందుకు ఆపమన్నారో నాకు తెలుసు బాబూ. బండి బయలుదేరి నప్పటినుంచి చూస్తున్నాను. అది జాగ్రత్తగా ఉందా? అని వందసార్లైనా అడిగి ఉంటారు. అదెక్కడికి పోతుంది బాబూ? అదుగో బాబూ. అదుగో అదే టోలుగేటు దగ్గరకు వచ్చేశాం. అక్కడ పన్ను కట్టడానికి ఆగినపుడు మీరే చూద్దురుగాని. సరేనా?"

"సరే! మంచిది. దాని సంగతి ఇంక అడగనులే!"

---

# మూడు

బండిలో కూర్చున్న ఆసామికి మాటిమాటికి ఇంతగా ఆందోళన కలిగిస్తున్నది, అతని దృష్టినంతనీ ఆ కట్టుకున్నది బండి ఇరుసుకు భద్రంగా కట్టిన మట్టిముంత. అది పోకనారు చుట్టిన సన్నమూతి ముంత. దాని ప్రక్కనే బండి దీపం. ఈ దీపం నాటుదీ. మోటుదీని. దాని నాలుగుప్రక్కలనున్న గాజు పలకలూ మసిపూతతో మూసుకుపోయాయి. దానిలో నుంచి మసక వెలుతురే బండి ముందుకు సాగడానికి ఆధారం. దాని ప్రక్కనే వ్రేలాడుతున్న మట్టి ముంత నీడ అగాధంలో పైకి తేలుతున్న పెద్ద పూసను తలపింప చేస్తున్నది.

అఖిలేశ్వరుని ఆలోచన లన్నీ ఆ ముంత మీదే కేంద్రీకరించబడ్డాయి. భక్తి, గౌరవము, బాధ, అనంత దుఃఖం ఒక్కుమ్మడి పురికొనగా అతని ఆలోచనలన్నీ దాని మీదే. తన ధనం, తన మానం, తన ప్రాణం తన జీవిత సర్వస్వం దానిలోనే నిక్షిప్తపరచి తాను వట్టి బికారిగా శూన్యంలో మిగిలిపోయినట్లుగా భావించుతున్నాడు. ఆ శూన్యంలో నుంచే ఒక సన్నని ప్రతిధ్వని బయల్వెడలి అంతరాంతరాలను అందుకొన్నట్టు అనిపించింది.

"నాన్న ఆరోగ్యం విషమించి పోతోంది. తక్షణమే బయలుదేరు." అత్తవారింటి దగ్గర ఉండగా ఈ తంతివార్త అందింది. తానేమో మామగారి ఊరికి బయలుదేరే టప్పుడు తండ్రిగారి ఆరోగ్యం చక్కగా ఉంది. చలి పిడుగువలె వచ్చిపడ్డ ఈ తంతి అతణ్ణి ఆపాదమస్తకం కుదిపి వేసింది. హఠాత్తుగా చూచుకోవడంల్లో అదిరిపోయాడు. వెంటనే తెప్పరిల్లి హుటా హుటిగా స్వస్థలానికి బయలు దేరాడు. విధివైపరీత్యం! మొదటిరైలు తప్పిపోయింది. మొత్తానికి ఎలాగో ఘటం పుట్టింటికి చేరవేశాడు. కాని ఏం లాభం. అప్పటికే అక్కడ హంస లేచిపోయింది. మిగిలింది తండ్రిగారి పేరుతో ఆ క్షణంవరకు చలామణి అయిన ప్రాణం లేని పట్టి కట్టె. అఖిలేశ్వరుడి తండ్రికి పన్నెండు గంటలలో మూడు సార్లు గుండె పోటు వచ్చింది. మొదటి రెండు సార్లు వచ్చినప్పుడే మనిషి బాగా జంకి పోయాడు. వ్యాధి ఉధృతానికి తట్టుకోలేకపోయాడు. మూడోసారి పోటు వచ్చేసరికి అంత పర్వతమంత మనిషీ నిస్సహాయుడై నేల కూలాడు. స్పృహతప్పి పోయేముందు అఖిలేశ్వరుడు వచ్చాడా? అని ఒకటి రెండు సార్లు ప్రక్కనే ఉపచారం చేస్తున్న వారిని అడిగాడు. 'అఖిలేశ్వర్, అఖిలే శ్వర్' అని పలవరిస్తుండగానే మనిషికి ధ్యాస తప్పిపోయింది. ఎలాగైతేనేమి అనాయాసంగానే హంస లేచిపోయింది. కాని అలాజరగడం ఎంత అన్యాయం! ఆయన తన కుటుం బంలో అందరికీ తన వ్యవహారపు గుట్టు, మట్టు, అన్నీ

చెప్పాడు. కాని గుండెజబ్బు సంగతిమాత్రం ఎవ్వరికీ చెప్ప లేదు. సంసారం గుట్టు, రోగం రట్టు అన్నారు. కాని ఆయన మాత్రం సంసారాన్ని రట్టు కీడ్చి, రోగం గుట్టుగా దాచి, తన దోవను తాను చల్లగా ఈ లోకంనుంచి జారి పోయాడు. ఇలా ఎందుకు చేసినట్టు? రోగం సంగతి చెబితే ఇంట్లో అందరూ అనవసరంగా బెంబేలు పడిపోతా రనుకున్నాడో ఏమో! వెనుకటికోసారి కాళ్ళూ, కీళ్ళూ పట్టేసినప్పుడు నాటువైద్యుడి దగ్గర మందు పుచ్చుకుంటే నయమైంది. అప్పుడు ఆ నాటు వైద్యుడు చెప్పనే చెప్పాడు. ''అయ్యా! మీ వంట్లో ఏదో కొత్తరకం జబ్బు ప్రవేశించి నట్టుంది. మొదటికి మోసం రాకుండా జాగ్రత్త పడవల సిందీ,'' అని. జాతకాలమీద విపరీతమైన విశ్వాసం కలవాడు అవడంచేత, తన ఆస్థాన జ్యోతిష్కుడు అరవై దాటిన తరువాత ఆయుర్దాయంసంగతి ఆలోచించ.వచ్చుననీ, అంతవరకూ ఏమీ ఢోకా లేదనీ, అంతకు పూర్వమే నమ్మ బలికి నందున వైద్యుని హెచ్చరికను అప్పుడే పెడచెవిని పెట్టాడు.

''అయ్యో దేవుడా! ఈ మాయదారి జబ్బు సంగతి నీ కానాడే తెలిసివుంటే నాతో చెప్పి ఉండవలసిం ద''ని అఖిలేశ్వరుని తల్లి భర్తపై పడి శోకాలు పెట్టింది. నలభై ఏళ్ళనాటి జంట నాటితో విడిపోయింది. నలభై ఏళ్ళకు పూర్వం ఎప్పుడు కాపురానికి వచ్చిందో ఏమో కాని

నాటి నుంచి నేటి వరకు భర్తను దైవసమానుడుగా పూజించుకున్నది ఆ సాధ్వి. ఎన్నడూ పెదవి విప్పి పల్లెత్తు మాట అనలేదు. మృదుభాషి. మితభాషి. భర్త అభిమతాలను ముందే కనిపెట్టి ఆయన అడుగు జాడలలో, కనుసన్నల మెలిగేది. ఆ అచ్చ తరళ సరళ హృదయ. "మీ ఆనందానికి ఒక్క క్షణమైనా అంతరాయం కలిగించ దలచుకోలేదు. భగవంతుడి దయవల్ల ఇంతవరకు మన కేమీ లోటులేకుండా, రాకుండా హాయిగా గడిచిపోయింది. ఇక ముందు కూడా ఇలాగే జరిగి పోవాలని నా కోరిక. నా జీవితంలో ఆఖరు కోరిక కూడా అదే. తల్లి కడుపులో నుంచి భూమిమీద పడింది లగాయతు ఈ క్షణం వరకు నాకే లోటు రాలేదు. నా జీవితమంతా పువ్వులలో పెట్టి నట్లు చక్కగా గడిచిపోయింది. నాకేకోరికలూ లేవు. విచారించవలసింది అంతకన్నా లేదు. నాకాలం తీరిపో యింది. నారోజు వచ్చింది. నేను సంతోషంతో వెళ్ళి పోతున్నాను" అన్నాడా సుశ్లోకుడు. ఎంతటి మనోనిబ్బరం, గుండె ధైర్యం ఆయనది! మృదుభాషి. నిరతోత్సాహి. ఎప్పుడూ హుషారుగా ఆనందంగా ఉండేవాడు. పొల్లు ఆలోచనలు, పలుగు మాటలు ఆయన ఎరుగడు. ఆయన మాటంటే పెద్దలకూ, పిన్నలకూ అందరికీ గౌరవమే. పెళ్ళాం పిల్లలకు ఆయనంటే భయభక్తులు, గౌరవాదర ణాలు చాలా ఎక్కువ. ఎంత మంచివాడు. ఎంత గొప్ప వాడు! చావంటే ఆయన ఎన్నడూ భయపడలేదు.

చావులో కూడా నవ్వుతూనే ఉన్నాడు. ఆయన చచ్చి ఏ స్వర్గానికి వెళ్ళాడో? బహుశా ఆకాశంలో మినుకు మినుకుమనే అనంతకోటి తారకలలో ఆయన ఒకటి కావచ్చు.

బాధతో అఖిలేశ్వరుడికి గుండెలు ద్రవించిపోయినట్లుగా వుంది. స్పృహతప్పిపోయేలోగా తాను వస్తే బాగుండునని తన తండ్రి ఎంతగానో అనుకున్నాడు. అవసాన ఘడియలలో పెద్దకొడుకు దగ్గరుండే అదృష్టం లేకపోయిందని తమ్ముడూ ఇతర బంధువులూ అందరూ బాధపడ్డారు. శవాన్ని స్నానం చేయించి పడుకోబెట్టే సమయంలో ఆ ముసలాయన బ్రతికిఉన్న రోజుల్లో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతూ ఉండేదనీ, మరణానంతరం గూడా ముఖంకళ తగ్గలేదనీ పదిమందీ పదేపదే అనుకున్నారు. పాలమీగడ వంటి క్షీరాబ్ధి పట్టుతాపితాతో, నుదుట తీర్చిదిద్దిన విభూది రేఖలతో, దానిమీద అద్దిన చందన గంధాక్షితలతో, మెడలో బంగారపు తొడుగు వేసి బిగించిన రుద్రాక్ష మాలతో భూశయనం చేసిన మహారాజువలె ఉన్నాడుకాని ఎక్కడా చనిపోయినట్లే లేదని అందరూ చెప్పుకున్నారు. ఆ అవసాన సమయంలో పిల్లలు, మనుమలు, మనుమరాండ్రు – అందరూ కాదు – మాఅక్కలు, చెల్లెండ్రు వారి పిల్లలు ఎంత అదృష్టవంతులు అనుకున్నాడు అఖిలేశ్వరుడు! కడుపులో పొరలి పొరలి వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ ఆయన చుట్టూ గుమిగూడి నిలుచున్నారు.

శవం చుట్టూ ప్రమిదెలలో ఆవునేతి దీపాలు పెట్టారు. శవంమీద వరిపేలాలు చల్లారు. అన్నివిధాలా అంతిమయాత్ర వైభవోపేతంగా జరిగినట్లుంది. కాని ఏమి లాభం? ఆ వైభవం అంతనీ చూడడానికి అయిదేళ్లవాడైన తన వంశోద్ధారకుడు ఆ సమయంలో అక్కడ లేడు. అదీ అఖిలేశ్వరుడి మనస్సును కలచివేస్తున్న సంగతి. తన భార్య, బిడ్డ ఆ సమయంలో తన అత్తవారింట ఉన్నారు. దుర్విధి! తానూ అక్కడే ఉన్నాడు. అవసాన సమయంలో దగ్గర లేకపోయినా కడసారి చూపులైనా తనకు దక్కుతాయని ఆశపడ్డాడు. వేళకు వస్తాడేమో పెద్దకొడుకు చితిమీద పడుకోబెట్టి తలక్రింద శాస్త్రోక్తంగా కొరవి పెడతాడని బంధువులందరూ ఆశించారు. ఆ భాగ్యమూ తనకు దక్కలేదు. తన తరువాతి చిన్నతమ్ముడే అంతిమ సంస్కారాలన్నింటిని నిర్వహించాడు. తాను బండి దిగి పిచ్చివాడిలా గుండెలు బాదుకుంటూ పరుగెత్తుకు వచ్చేటప్పటికల్లా అంతా అయిపోయింది. అప్పటికప్పుడే అగ్నిజ్వాలలు తండ్రిగారి దేహాన్ని చాలావరకు ఆహుతి చేసేశాయి. ఇంకేముంది! తండ్రిగారు మరణించడమూ, దహనమై భస్మరాశిగా మారిపోవడమూ కూడా జరిగిపోయింది! చావడమంటే చావడమే అనుకున్నాడు. శరీరంలో ఉన్న ఊపిరిఅంతా ఒక్కసారిగా విడిచేయడం: అప్పుడు జిహ్వ తన రసనను కోల్పోతుంది. నాసిక ఘ్రాణశక్తినీ, కర్ణములు శ్రవణశక్తినీ, నేత్రములు దృష్టినీ కోల్పోతాయి. కళ్లుపోయినా, చెవులు

వినబడకపోయినా, అంధుడైనా, బధిరుడైనా దాదాపు చచ్చి నట్లే లెక్క, చావు ఊపిరినంతా పోగొట్టుకోవడం! నాన్న గారు మరణించారు. దహనమై గుప్పెడు అస్థికల రాశిగా మారిపోయారు.

బండి ఇరుసుకు కట్టిన ఆ ముంతలో తండ్రిగారి అస్థికలున్నాయి.

---

# నాలుగు

బండిలో కూర్చున్నాడన్నమాటేకాని అఖిలేశ్వరుడి మనస్సు మనస్సులో లేదు. గతకాలపు సంఘటనలు ఒక్కొటొక్కటిగా బాధగా మనోనేత్రం ముందు ప్రత్యక్షం కాజొచ్చాయి. అవన్నీ అప్పటి కప్పుడు తన కళ్ళ ఎదుట జరుగుతున్నట్లు అనిపించుతున్నాయి. మనిషి ఆగర్భ శ్రీమంతుడు. శ్రీమంతుల ఇంటిబిడ్డ. పుట్టుభోగి. కష్టాలేమిటో ఎరుగనే ఎరుగడు. మర్యాదస్తుల కుటుంబంలో పుట్టి, మర్యాదస్తుల మధ్య పెరిగాడేమో పలుగుమాట లెరుగడు. అందుకనే ముప్ఫైఏళ్ళు పైబడ్డప్పటికీ అఖిలేశ్వరుడికి కష్టాలేమీ వంటబట్టనేలేదు. అలాంటివాడికి తండ్రిగారి మరణం అశనిపాతంవలె భరింపరానిదైంది. ఇంతకీ ఆయనకు చావు నిద్దరలో వచ్చింది. ఆయన జరా రుజా పీడితుడు కాకుండానే చల్లగా దాటిపోయాడు. ఆఖరు క్షణం వరకూ జ్వరున చీది ఎరుగునా? తలనొప్పి ఎరుగునా ? కొందరున్నారంటే అణువణువునా కుళ్ళిపోతూ మంచం పట్టి మరణిస్తారు. అలాంటి ముసలివాళ్ళకి చావులంటే ఎంత భయం ! చీటికీ మాటికీ కస్సు బుస్సు మంటూంటారు. ఈ బాధకంటే ఆ చావే మేలని అస్తమానం కోరుకుంటూ ఉంటారు. అలాంటి అవస్థ ఏమీలేకుండానే ఆయన వెళ్ళి

పోయాడు. మృత్యువు పొంచుండి ఆయనమీద దొంగ పోటు దెబ్బతీసింది. అదే విధివైపరీత్యం! ఈ సంగతులన్నీ జ్ఞాపకం వచ్చేసరికి అఖిలేశ్వరుడికి వళ్ళు మండిపోయింది! ఆవేశంతో మనస్సు కుతకుతా ఉడికిపోయింది. యముణ్ణి ధర్మరాజు అన్న మూర్ఖుడెవ్వడు? ఇదేనా ధర్మం? వెలుగు రేకలు విరాజిల్లే చోటును చిమ్మచీకటిమయం చేసివేయడ మేనా? సుఖంగా వెళ్ళే బండిని వెళ్ళనీయకుండా వేయి విధాల ఆటంకాలు కల్పించడమేనా? ఆశలను, ఆనందాన్ని మొదలంట త్రుంచివేసి, నిరాశనూ, నిస్పృహనూ నెలకొల్ప డమేనా? పారలౌకిక క్రియలను నిర్వర్తించే టప్పుడూ దాయాదులు, పినతండ్రులు, బావమరదులు, ఒకరేమిటి పరామర్శకు వచ్చిన ప్రతివారూ పెద్దరికం పైనవేసుకుని ఏదో ఒకటి పురమాయించబోవడం, చీటికీ మాటికీ చిరాకు పడుతూండడం చూచినప్పుడూ మృత్యువు అనివార్యమైన దనే అభిప్రాయం అతనిలో పాతుకుపోయింది. పైగా ఇంతంత అహంభావంతో ఒక గ్రామాన్నో, ఒక వీధినో, ఒక దేవాలయాన్నో, ఒక సత్రాన్నో, లేకపోతే గ్రామ పంచాయితీనో శాసిస్తూ ఉన్నవారంతా తండ్రిగారిలాగా హఠాత్తుగా గుండెపోటుతో మృత్యువుకు వాతపడవలసిందే కదా అనుకున్నాడు. ఇంతకీ తండ్రిగారి దేహాన్ని కాల్చి వేసిన చితి ఇంకా చల్లారక మునుపే తన తోబుట్టువులు ముగ్గురూ తల్లిగారి నగలను, విలువగల చీరలను ఎవరెవరు వేటిని వేటిని తీసుకోవాలన్న విషయమై గుట్టుగా గుంపి

తంపీలు పడడం గుసగుసలాడుకోవడం అఖిలేశ్వరుడి చెవిలో ప్రవేశించకపోలేదు. అంతవరకూ కలకలలాడుతూ ఉండే అమ్మ ముఖం తండ్రిగారు మరణించడంతో వెలతెలా పోయింది. ఆ పదిరోజుల కర్మ పూర్తి అయ్యేసరికి చెన్ను దరిగి, వసివాడి హఠాత్తుగా పదేళ్ళు పెద్దదైపోయినట్లు కనబడింది. ఇంతకీ ఆవిడ వితంతు వేషం ధరించనేలేదు. ఆవిడ అలా దుఃఖంతో కుమిలిపోతూనే ఉంది. ఈ అక్క-చెల్లెండ్రు అమ్మ చీరలూ, నగలూ ఎవరెవరు ఏవేవి తీసుకోవాలని తర్జనభర్జనలు సాగించుకుంటూనే ఉన్నారు. మొన్న పోయిన దీపావళినాడు అమ్మకోసంకొన్న వంగపండు రంగు ఆరణి పట్టు జరీచీర ఎవరు తీసుకోవాలి? అమ్మ రవ్వల దుద్దులు, పుష్యరాగాల హంసబేసరి, అడ్డిగ, మూడుపేటల ముత్యాల జిగిణీగొలుసూ, రవ్వలవంకీ, పగడాలపేరు, గజలక్ష్మిపతకమూ పెద్దనగలన్నీ ఇకముందు పెట్టుకోగల అదృష్టవంతురాలెవ్వరో ? అందరికీ అన్నీ కావాలి. ఆడపిల్లలు ముగ్గురూ ఎవరికివారే అన్నీ కాజేద్దామని ఎవరికి తోచిన పన్నాగాలు వారు పన్నుతున్నారు. ఎంతలో ఎంతమార్పు ? కుటుంబంలో అందరినీ అంతవరకూ ఒక్క-త్రాటిమీద నడిపించుకువచ్చిన ఆ మూర్తి అంతర్ధానం కావడంతో, అన్నదమ్ములైనా, అక్క-చెల్లెండ్రైనా, ఒక్క-తల్లి బిడ్డలమే అన్న ఆలోచన అయినా లేకుండా అలా పేగు సంబంధం తెంపి పారవేసుకోవలసిందేనా ? కుటుంబం అంతటినీ కుక్క-లు చింపిన విస్తరిగా చేసుకోవలసిందేనా ?

తన చిన్న చెల్లెలు తనకంటె రెండేళ్ళు చిన్నది. చిన్నప్పటి నుంచీ ఎంతో గారంగా పెరిగింది. అమ్మకి అదంటే మరీ ఆపేక్ష. అతిగారం వల్ల కొంచెం పెంకితనం అబ్బింది. దానికి తోడు వస్తుతః స్వార్థదృష్టి ఎక్కువ. అలాంటిదాన్ని శ్రీమంతుల కుటుంబంలోకి ఇచ్చారు. పెళ్ళి అయింది అంతే. మహారాజాణి. ఈవిడ అత్తవారింట పాదంమోపింది. అంతే. అప్పటినుంచి మొగుణ్ణి చెంగున ముడివేసుకు తిరగడం ప్రారంభించింది. ఎంత చెబితే అంత. మారుమాట చెప్పకుండా శిరసావహించడమే ఆ మొగుడి పని అయింది. ఈవిడకి ఇద్దరు పిల్లలు. కొడుకూ, కూతురూనూ. వాళ్ళిద్దరూ బ్రహ్మరాక్షసులు. అల్లరి చెయ్యడంలో, కొంపను ఒక కడకు తీసుకురావడంలో వాళ్ళకు వాళ్ళేసాటి. ఇంక రెండోసోదరి ఉందంటే వట్టి గంగిగోవు. అభం శుభం తెలియని అమాయకురాలు. పుట్టెడుమంది సంతానం. ఎప్పుడూసూలింత, బాలెంతగానే ఏటి కేడాదీ గడచిపోతుంటుంది. ఇంక ఆమె భర్త వట్టి విలాస పురుషుడు. కించిత్తు రసికుడు కూడాను. ఎలా తగులవేసినా తరగని సంపద వాళ్లది. ఆయన పోకళ్ళన్నింటిని ఆ మహాఇల్లాలు చూచీచూడనట్లు ఊరుకుంటుంది, ఇంక మూడవసోదరి అందరిలోకీ అందమైనదీ, తెలివైనదీని. ఈమె అంటె తండ్రిగారికి మక్కువ ఎక్కువ. మంచి పట్టుదల మనిషి. అప్పుడు గర్భిణిగాఉంది. ఈవిడ దిగులు అంతా తనకు పుట్టబోయే బిడ్డను చూడకుండానే తండ్రిగారు కాలం చేశారే అని. ముగ్గురూ ముగ్గురే. అందరూ అందరే.

అయినా అందరిలోనూ ఉన్న ఒకసుగుణం. ఏమిటంటే ఆ ముగ్గురికీ కూడా అఖిలేశ్వరుడంటే అమితమైన అభిమానమూ, గౌరవమున్నూ. వదినెగారన్నా కూడా అంతే. అందులో దాపరికం ఏమీ లేదు. అయితే వారిలో వారికి ఈసులు మెండు. అందుకు వాళ్ళను అనవలసిన పనేముంది? ఆడవాళ్ళంతా అంతేనేమో! వాళ్ళభర్తల సిరిసంపదలు, మర్యాదలు, ఆస్తిపాస్తులు, ఆశ్లేయ పౌరుషేయాలు అన్నింటిని బట్టి ఈ హెచ్చు తగ్గులు నిర్ణయమవుతూ ఉంటాయి. ఇంక కడగొట్టు కుర్ర అందరిలోకీ చిన్నవాడు. వాడి కింకా వడసారం పదిహేనేళ్ళు నిండలేదు. వాడంటే ఇంట్లో అందరికీ ముద్దే. వాడికి ఈ అన్నగారంటే – పదిహేనేళ్ళు వారఉన్నప్పటికీ – పంచప్రాణాలున్నూ. అలాంటివాడికే ఈ ప్రపంచంలో ఇంకెవ్వరున్నారు ? అన్నింటికీ తానే అలాంటిది ఆస్తిపాస్తులకు తామిద్దరూ చెరిసగం. పంచుకోవలసి ఉన్నదనే ఆలోచనే వెగటుగా ఉంది. ఆ మాట తనమామగారు చూచాయగా చెప్పనే చెప్పారు. సకాలంలో ఆస్తిపాస్తులను పంచుకొని ఎవరి మానాన వారు సుఖంగా స్వతంత్రంగా ఉండడంవల్ల ఆనక ఎడమొగం పెడమొగం కానక్కర లేకుండా సుఖంగా కలసిమెలసి ఉండవచ్చుననీ, లేకపోతే మనస్పర్థలు, అపోహలు పెరిగి, ఒకరికొకరు దూరమైపోతారనీ ఆయన చెప్పనే చెప్పారు. ఏమిటో అసలు అలాంటి ఆలోచనే తనకు అసభ్యంగా, అసహ్యంగా ఉన్నది. ఎందుకంత తొందర ? తండ్రిగారి అస్థికలింకా అలా కణకణ

లాడుతూనే ఉన్నాయి. ఇంతలోనే ఇంత తొందరపాటు దేనికి ?.........

ఈ అస్థికలను మట్టిముంతలో పెట్టి తమ ఇంటి వెలుపల ఉన్న రావిచెట్టు మొదట మట్టిదిబ్బలో పాతిపెట్టి, ఆరుమాసములు దాచారు. ఈ రావిచెట్టును అఖిలేశ్వరుడి తాతగారు – తండ్రి తండ్రి – నాటి, దానికి ఉపనయనం చేసి, సకాలంలో వేపచెట్టుతో మహావైభవంగా పెళ్లి చేయించారు. ఆ పెళ్లి వైభవం చూచినవారు చెప్పవలసిందే కాని వర్ణించడానికి వీలులేదు. అంతవైభవం 'నభూతో న భవిష్యతి' అంటారు. ఇప్పుడా జంట విడిపోయింది. ఆ వేప చెట్టు అక్కడలేదు. ఎప్పుడయినా రావిచెట్టు ఆకులు గాలికి రాలినపుడు అది ప్రియవియోగ దుఃఖాన్ని భరించలేక కన్నీళ్లు కారుస్తున్నట్లు అనిపిస్తుంది. అఖిలేశ్వరుడు ఆరు మాసాలపాటు నెలనెలా ఎప్పుడూ మానకుండా తండ్రి మాసికాలు యథావిధిగా పెడుతూనే ఉన్నాడు. ఆఖరుకు ఈ రోజు రాత్రి ఆ అస్థికలను రావిచెట్టు మొదటినుంచి త్రవ్వించి బయటికి తీసి గంగలో కలపడంకోసం భార్యతో సహా కాశీకి బయలుదేరాడు. ఈ అస్థికలను ఏరోజున ఏ ముహూర్తంలో గంగార్పణంచేయాలో కులబ్రాహ్మణుడు ముందుగానే నిర్ణయించాడు. ఇందుకు కావలసిన అన్ని ఏర్పాట్లూచేసి అంతాసిద్ధంగా ఉండడంకోసమని ముందుగానే ఆ పురోహితుడు కాశీకి వెళ్లాడు. ఇలాంటి వాటిల్లో ఆయన

ఉద్దండుడు. మహాఅనుభవశాలి. ఈ సమయంలో అఖిలేశ్వరుడికి పితరుల అస్థి నిమజ్జనం కోసం కాశీప్రయాణం చేసిన తనతండ్రి, తండ్రి తండ్రి, ఆయన తండ్రి అందరూ జ్ఞాపకం వచ్చారు. అందులోనూ ఆ రోజులలో—ఇండియాలో రైళ్లు ఇంకా పడని ఆ రోజులలో—తన ముత్తాతగారు ఇంతదూరం ఆ అస్థికలమూట నెత్తినపెట్టుకొని కాళ్లీడ్చుకుంటూ కాశీకి నడిచి వెళ్లారంటే ఎంత కష్టపడిఉంటారో అనిపించింది. ఆ రాత్రి అఖిలేశ్వరుడు తన స్వగ్రామంనుంచి పాతికమైళ్ల దూరంలో ఉన్న రైలుస్టేషన్‌కు చేరుకోవడంకోసం రెండెడ్ల బండి ఎక్కి బయలుదేరాడు సతీసమేతంగా. అక్కడినుంచి తెల్లవారకట్ల రైలుఎక్కి మరినాలుగు బళ్లుమారి చివరకు అత్యంత పవిత్రమైన కాశీక్షేత్రం చేరుకోవడమే ఈయన పరమలక్ష్యం.

అఖిలేశ్వరుడి భార్య బండిలో పడుకొని గాఢనిద్రలో మునిగింది. తొడమీద ఉన్న తల మళ్లీకొంచెం జారింది. ఆ సమయంలో ఆమె జుట్టు రేగిఉంది. ఆ రేగిన జుట్టుకేసి అఖిలేశ్వరుడు అదోలా చూచాడు. నిద్ర మత్తులో ఆమె పెదవులు విడిఉన్నాయి. ఓరగా తెరచుకున్న నోటిలోనుంచి ఆమె మృదువుగా శ్వాసించుతోంది. బండి కుదుపుతోపాటు ఆమె వళ్లు అంతా కదులుతోంది. ఆమె చేతిమీద తలనాన్చి నిద్రపోతోంది. అలా నిద్రపోతున్న అర్ధాంగిని చూడడం తోనే అఖిలేశ్వరుడికి ఒక్కసారిగా ఆవిడమీద ఆపేక్ష

పొంగివచ్చింది. ఇలాంటి ప్రేమభావం అతనికి ఇదివరకెన్నడూ కలుగనేలేదు. తనప్రక్కనే పడుకుని తాపీగా నిద్రపోతున్న ఆమె ఇహలోకపు సంబంధాలన్నింటిని పూర్తిగావదల్చుకుని ఏకాకినిగా ఉన్నట్టు అనిపించింది. కొడుకునుకూడ తీసుకుని వచ్చిఉంటే ఆమెకింత ఒంటరితనం చుట్టుకునేది కాదేమో అనుకున్నాడు. పాపం! పసివాడు కూడావస్తానని ఎంత ఏడ్చాడు! వాడి ఏడుపు చూడలేక ఈతల్లికి కూడా కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. కాని ఇంట్లో పెద్దవాళ్లు ససేమిరా కూడదంటే కూడదన్నారు. వెళ్లేపనికి అడ్డం. పైగా దోవ పొడుగునా యాతన. పైగా ఇదేమి,మామూలుప్రయాణమా? మతవిధులు నిర్వర్తించడంకోసం పెట్టుకున్న ప్రయాణ మాయిరి! అందుచేత ఏమైనా సరే కుర్రవాణ్ణి కూడా తీసుకు పోరాదని కట్టడిచేశారు. పాపం! పసివాడు. ఆ తల్లిమాత్రం ఏం చేస్తుంది? ఏమి చేయగలదు? పెద్దలమాటకెన్నడూ జవదాటి ఎరుగని తానుమాత్రం ఏమిచేయగలడు? అంతే. మనస్సు సరిపెట్టుకున్నాడు. ఉత్తప్పుడు ఉసిరికాయలు పుల్ల గొడ్డు కాని, నీటి కరువు వచ్చినపుడు అవే తియ్యగా ఉంటాయి!

మోచేతిమీద ఆనుకుని అఖిలేశ్వరుడు తన అర్ధాంగి ముఖంలోకి సాలోచనగా చూశాడు. చూడగా చూడగా ఆమెలో ఒంటరితనం గూడుకట్టుకు పోయినట్టు అనిపించింది. ఆమె తన్ను విడిచి అలా అలా దూరదూరంగా జరిగిపోతు

న్నట్టూ, చివరకు అదేదో మండలంలో నక్షత్రమేఘంగా మారిపోతున్నట్టూ అనిపించింది. ఏదో చలిబాధ మూలుగులలోకి ప్రసరించినట్లు అనిపించింది. వెంటనే చడీచప్పుడు లేకుండా ఆమె ప్రక్కనే పడుకున్నాడు. ఆమెను నిద్రలేపకుండా, ఆమె చెదరిన ముంగురులను మెల్లగా చల్లగా నిమరడం ప్రారంభించాడు. ఆమె సుందర దేహాన్ని మృదువుగా తన హృదయానికి హత్తుకున్నాడు. అక్కడితో ఆలోచనలన్నీ కట్టుబడిపోతాయని ఆశించాడు. నిడుదఊర్పులతో, నులివెచ్చని స్పర్శతో ఆమె తన కౌగిలిలో కరగిపోతోంది! ఈ పరిస్థితిలో ఆమెతో గడచిన పదేళ్ళుగా తాను సాగించిన సాంసారిక జీవితపు స్మృతులెన్నెన్నో ఒక దానివెంట ఒకటి కళ్ళకు కట్టినట్లు కనబడసాగాయి.

పెళ్లినాటి ఆమె ముగ్ధసౌందర్యం. భార్యగా ఆమె ప్రదర్శించిన ప్రణయం. కొడుకు తల్లిగా ఆమెచూపించిన అతిశయం. ఇంటికి పెద్దకోడలు, క్రొత్తగా కాపురానికి వచ్చినప్పటి మధురానుభావాలు అన్నీ ఒక్కుమ్మడిగా జ్ఞాపకానికివచ్చి ఆవేశవివశుణ్ణి చేసేశాయి. తనకు తెలియకుండానే తనలో తాను, జగదాంబా, జగదా, జగదా అనుకున్నాడు. సప్తపది సమయంలో 'నాతిచరామి' అని తాను చేసిన శపథం అతనికి పదేపదే జ్ఞప్తికి వచ్చింది. అతనిలో పత్నీప్రేమ పొంగులువారింది. ఒక్కసారి ఆమెను దగ్గరగా లాక్కొని హృదయానికి హత్తుకున్నాడు. ఆమె నులి

వెచ్చని కౌగిలిలో మృదుల స్పర్శసుఖం అతని ఎడద లోతులను తాకింది. ఇంతలో సన్నసన్నగా సంఘర్షణ ప్రారంభమైంది......

"నాయనా మోసపోయావు" అశరీరవాణిలా వినబడింది.

ఏమిటిది? ఎక్కడిదీమాట? ఎవరుమాట్లాడుతున్నారు అన్నట్టు కనుబొమలు ముడిచి చూశాడు.

'మోసపోయావు' అన్నమాట ఖంగున మ్రోగింది. అది తండ్రిగారి గొంతుకవలె ఉంది. నిజమే. సందేహం లేదు. తండ్రిగారిగొంతుకే. వెంటనే ఉలిక్కిపడి లేచాడు. ఆ లేవడంలో జగదాంబ వళ్ళో పడుకుందన్న సంగతే మరచిపోయాడు. ఇంతలో బండివెనుకనున్న తెరను ఒత్తిగించి బండివాడు ఏదో కొంపమునిగిం దన్నట్లు తన్ను పిలువడం గమనించాడు.

"ఏమి విశేషం, ఏమిటి మునిగిపోయింది?" అని అడిగాడు. బండికదలకుండా నిలిచిపోయిందనే సంగతిని గమనించాడు.

"ఆ ముంత అక్కడలేదుబాబూ. ఎక్కడైనా పడిపోయిందో ఏమో!" అన్నాడు బండివాడు కాతరస్వరంతో.

"ఏమిటీ! ముంత లేదూ!" అంటూ అదరిపడ్డాడు అఖిలేశ్వరుడు. బండిలోనుంచి క్రిందకు ఒక్కదూకుదూకాడు.

ముందుకువంగి బండి ఇరుసుకేసి తొంగి తొంగి చూడడం ప్రారంభించాడు. పొగచూరిన కిరసనాయిలుదీపం మాత్రం గాలికి అటూ, ఇటూ ఊగుతోంది. దానిప్రక్కనే బిగించి కట్టిన అస్థికల ముంత మాత్రం మాయమై పోయింది. మనిషి నిర్ఘాంతపోయాడు. నోటమాట లేకుండా నిశ్చేష్టుడై పోయాడు. కొయ్యబారినట్టు నిలుచున్న అతని మోము వెల్లనై పోయింది. మనస్సు శూన్యమైపోయింది. ఈ దుర్వార్త జగదాంబను అశనిపాతం వలె తగిలింది. ఆవిడకూడా ఆయాసపడుతూ నూతిలోనుంచి మాట్లాడుతున్నట్లు "ముంత కనబడడంలేదూ? ముంత కనబడడంలేదూ?" అంది.

ఆవిడ భయకంపిత స్వరం విని అఖిలేశ్వరుడు మళ్ళీ ఈలోకంలో పడ్డాడు.

"ముంతకు కట్టిన ఉగ్గిలి తెగిపోయింది కాబోలు బాబుగారూ" అన్నాడు బండివాడు, ఆ దుస్సహ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ. అవుననికాని కాదనికాని ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. ఆ రోడ్డుమీద పిచ్చివాడివలె వెనక్కు పరుగెత్తుతున్న భర్తను అనుగమించడానికై ఆవిడ బండిలోనుంచి దూకటానికి ప్రయత్నిస్తున్న సంగతి బండివాడి కంట బడింది. "వద్దు, వద్దు, అక్కడే ఉండండి. బాబుగారు ఇప్పుడేవస్తారు. ఇంతలో మీ కెందు కాశ్రమ? కాళ్ళకు దెబ్బతగులుతుంది." అంటూ ఆవిడ దిగకుండా బండివాడు తెర అడ్డంపెట్టాడు.

# అయిదు

ఇంతలో చంద్రోదయమైంది. వెన్నెల పుచ్చపువ్వు వలె కాస్తోంది. ప్రపంచం అంతా వెండిపూత పెట్టినట్లు కనబడుతోంది. ఆ సమయంలో అఖిలేశ్వరుడు ఆ ముంతను వెదకుకుంటూ పరుగెత్తుతున్నాడు. ప్రతిగొప్పా, ప్రతిగొయ్యా, ప్రతిపుట్టా ఆతురతతో వెదికాడు. ఆయన అలా పరుగెత్తుతుండగా రకరకాల నీడలు అన్నివైపులనుంచి వచ్చి చుట్టిముట్టినట్లు అనిపించింది. ఏదో భూతప్రపంచంలోనుంచి వెళ్లుతున్నట్టుగా అదేదో భయం అతని గుండెలను అలముకొంది. అన్నివైపులా తన అశ్రద్ధకు అపహాసిస్తున్నట్లు రకరకాల గొంతులు వినబడ్డాయి. తన్ను క్షమించండని అతడు ఈ అజ్ఞాత శక్తులకు వేయివిధాల మ్రొక్కుకుంటుండగా కళ్ళవెంట నీళ్ళు బొటబొటా కారాయి. కళ్ళనీళ్లు నిండడంతో చూపు మసక మసకగా మారిపోయింది. ఎలాగో ధైర్యం చిక్కబట్టుకుని కళ్ళు తుడుచుకొని రుద్ధకంఠంతో ఆ చెట్లనీడలోపడి పరుగెత్తాడు. నెత్తిమీద గుడ్లగూబ మోడుచెట్టుమీద నిలిచి రెక్కలు తపతపలాడించింది. పరుగెత్తి పరుగెత్తి మోకాళ్లు పట్లుపట్టాయి. అయినా రొప్పుకుంటూ అలా పరుగెత్తుతూనే ఉన్నాడు. వళ్ళంతా చెమటలు కారిపోతున్నాయి. ఒక్క నిముషం

ఆగాడు. కళ్లు మూసుకు నిలబడ్డాడు. చంద్రుడుకూడా మబ్బులో దూరాడు. కళ్లు తెరచి చూశాడు. చంద్రుడు కూడా మబ్బులోనుంచి బయటకు వచ్చాడు. ఆ వెన్నెలలో రోడ్డుఅంతా ఎంతో అందంగాకనబడింది. కళ్లెదుట బారెడు దూరంలో పచ్చికలో రెండు నెరదలమధ్య ముంత కన బడింది.........

దీనికోసం ఎంతదూరం, ఎన్ని మైళ్లు పరుగెత్తుకు వచ్చాడో అఖిలేశ్వరుడికి తెలియదు. అలసి సొలసి మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ బండిదగ్గరకు తిరిగి వచ్చాడు. కాని కళ్లు మాత్రం సంతోషంతో జేవురించి ఉన్నాయి. ముంత భుజానికి తగిలించుకుని బండిదగ్గరకు వచ్చాడు. అప్పటికి బండి రోడ్డువారగా ఉంది. ఎద్దులను విప్పేశాడు. ఎద్దులు తాపీగా మేస్తున్నాయి. జగదాంబ అక్కడే ఉన్న చెట్టుకు ఆనుకు నిలబడింది. కొంచెందూరంలో పరచిన గడ్డిమీాద బండివాడు కూర్చొని చుట్ట ముట్టించాడు. ‘‘అమ్మయ్య! దేవుడి దయవల్ల అది మళ్ళీ దొరికింది!’’ అన్నాడు అఖిలేశ్వరుడు భార్యతో.

ఆమె ఏమీా మాట్లాడలేదు.

‘‘ముంత ఉన్నదున్నట్లు దొరికింది. ఎక్కడా పగల లేదు. అదంతా దేవుడి దయే! కాకపోతే కదులుతున్న బండినుంచి పడి దొర్లిపోయినప్పటికీ పగలకుండా ఉండడం ఎంత అద్భుతం!’’

అఖిలేశ్వరుడు చెప్పుకుంటూ పోతున్నాడు. అయినా ఆమె ఏమీ మాట్లాడలేదు. అదేమంత అసాధారణ మని పించలేదు.

ఇలాంటి వింత జరిగినందుకు బండివాడు అఖిలేశ్వరుణ్ణి అభినందించాడు.

"ఇంత జరిగిందికదా, ఇంకఅయినా ఈ ముంతను బండిలో ఉండనిద్దూ" అని అఖిలేశ్వరుడు బండివాడిని బ్రతిమాలాడు.

"వీల్లేదు! వీల్లేదు! చచ్చినవాడి అస్థికలను నా బండిలో ఉంచడానికి వీల్లేదు. ఈ సంగతి తెలిస్తే మళ్ళీ ఎవ్వరైనా బండి ఎక్కుతారా? నేనూ, నాఎద్దులూ మాడి చావవలసి వస్తుంది. ముంత ఈసారి పడిపోదండి. మీకు అలాంటి భయం అక్కరలేదు."

"నిజమే నంటావా?"

"ఆ! ఈసారి ఇంకోముడి ఎక్కువగావేసి గట్టిగా కట్టండి." అంతట అఖిలేశ్వరుడు ఇదివరకటిలాగానే ఇరుసుకు మళ్ళీ ముంతను గట్టిగా జములుముడివేసి బిగించి కట్టాడు.

బండివాడు ఎద్దుల ముందున్న మిగిలిన గడ్డినంతనీ ఆదరాబాదరాగా పోగుచేసి లోపల చాపక్రింద చక్కగా సర్దేశాడు. ఎద్దులను మళ్ళీ బండికి కట్టి "ఎక్కండి, ఇంక వెళ్ళుదాం!" అన్నాడు.

# ఆరు

అలసిపోయాడేమో, అఖిలేశ్వరుడికి కునుకుపట్టింది. అయితే అది గాఢనిద్ర కాదు. కేవలం కలతనిద్ర. ఒక మాదిరి మగత. అంతే. అటు సుషుప్తీకాదు. ఇటు జాగ్రదవస్థాకాదు; ఆ రెండిటికీ మధ్య దోగాడుతున్న ఆ సమయంలో ఆతని నోరు మెదిలింది. పెదవులు ఏదో చెప్పబోయినట్లు వణికాయి. అస్థికల పాత్ర కనబడలేదన్న ఆ దుర్ముహూర్తంలో ఆమెపట్ల ప్రదర్శించిన చిరాకుకు, విసుగుదలకు పరిహారంగా ఏమైనా చెప్పబోయి అనువైన మాటలకోసం వెదకుతున్నట్లుగా ఉంది. ఇంతలో ఆ మంచిమాటలు దొరికి వాటిని ఆమెకుచెప్పి, ఆమెను అనునయపరచినప్పుడు కలిగే ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నట్టు ఇప్పుడాతని పెదవులు ఇంకొకరకంగా కదలడం మొదలుపెట్టాయి. మెల్లిగా, మృదువుగా ప్రార్థనపూర్వకంగా అఖిలేశ్వరుడు ఏదో అనడం మొదలు పెట్టాడు.

"దర్భాసనాసీనులైన ఓ పితృదేవతల్లారా! మమ్మల్ని అనుగ్రహించండి. ఇదిగో ఇవన్నీ మీ కోసమే. మా యీ నివేదనను దయచేసి స్వీకరించండి."

"మాకు మహాశుభములను అనుగ్రహించండి. ఆయు రారోగ్యాలను, బలాన్ని, కష్టరహితజీవనాన్ని అనుగ్రహించండి."

"మోకరించి దక్షిణాభిముఖులై మేము సమర్పించిన నివేదనను తమరు స్వీకరించండి."

"అల్పమానవులమైన మేము సంకుచిత బుద్ధితో నేరక చేసిన నేరము లన్నింటిని మన్నించండి. ఓ పితృ దేవతల్లారా!"

"ఉషఃకాలపు అరుణరేఖల అంకతలంమీద ఆసీను లైవున్న ఓ పితృదేవతల్లారా! తమకు మ్రొక్కిన మానవు లకు ఐశ్వర్యాన్ని ప్రసాదించండి."

"ఓ తండ్రులారా! మీ బిడ్డలందరకూ మీ ఐశ్వ ర్యంలో పాలుపంచిపెట్టండి. వారందరికీ శక్తిసామర్థ్యాలను అనుగ్రహించండి."

ఈ విధంగా అఖిలేశ్వరుడు చేసిన ప్రార్థన ముగిసింది. ఆతని ఆననసీమను అంతవరకూ తోచిన అపురూప ప్రశాంత తేజస్సు అంతర్థానమైపోయింది. మళ్ళీ బాధగా ఒళ్లు విరచు కున్నాడు. ఏదో ఒక అదృశ్యశక్తి తనను వ్యతిరే కంగా తనలోని సదసద్వివేకాన్ని వమ్ముచేసినట్లు భావించ సాగాడు.

జగదాంబ ఆసమయంలో లేచికూర్చుని అఖిలేశ్వ రుడికేసి అదోలా చూచింది. ఇంతకూ తనకూ అఖిలేశ్వరు

డికీ గల సంబంధం ఏమిటి? తాను నిజంగా అతని భార్యయా? అతనివల్ల వంశోద్ధారకుణ్ణి కన్నది తానేనా? ఆమెకు ఆనాటి మధురస్మృతులు ఒక్కొక్కటిగా జ్ఞాపకం రాసాగాయి. అతడు ఆమెను అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నాడు. భార్యను ప్రేమించడంలో అతడు ఎవ్వరికీ తీసిపోడు. ఒక పురుషుడు ఒక స్త్రీని ఎంత గాఢంగా ప్రేమించగలడో అంత గాఢంగానూ అర్ధాంగిని ప్రేమించాడు. ఎప్పుడూ చిన్న పిల్లవాడిలా ఏదో బిడియ పడుతూ మాట్లాడేవాడు. అతనికి అత్యంత సహజమైపోయిన ఈ శిశు సారళ్యమే అతణ్ణి తనకు అత్యంత ఆకర్షణీయుడుగా చేసింది. ఎప్పుడైనా ప్రేమ పట్టలేనప్పుడు ఆవేశంతో వణకిపోతున్న కరకమలాలతో కోమలంగా ఆమె బుగ్గలను, కనుబొమ్మలను, చుబుకాన్ని నిమిరేవాడు. కాపరానికి వచ్చిన కొత్తలో అందరిమధ్య మసలుతున్నప్పుడు, ఎలాఉన్నావు అని అడుగుతున్నట్లుగా ఆమెకేసి అదోలా ప్రశ్నార్థకంగా చూసేవాడు. ఆ సమయంలో అతని ముఖమండలంలో మౌనంగా వ్యక్తమయ్యే ప్రశ్నలన్నింటికీ ఆమె మౌనంగానే జవాబు చెప్పేది. అన్నింటికీ జవాబుగా ఒక్క చల్లని చిరునవ్వును విసిరేది. అంతా బాగానే ఉంది; నేను హాయిగానే ఉన్నాను; మీకేమీ బెంగ అక్కరలేదు అన్నట్లు ఆ మందహాసం సందేశం అందించేది. ఇంక కోడలంటే తన తల్లికిగల ఆపేక్ష చెప్పనే అక్కరలేదు. ఆమె దృష్టిలో తన గేహిని అందాలవాహిని. చక్కనిచుక్క. వినయమున

కిక్క. అటు అందమూ, ఇటు మంచితనమూ రంగరించి పోత పోసి ప్రాణ ప్రతిష్ఠచేసిన లక్ష్మీదేవి తానై తన ఇంటికి సాక్షాత్తు పెద్దకోడలుగా సాక్షాత్కరించినట్లు మురిసి పోయేది. పదహారోయేట పనసపండు వంటి కొడుకు నెత్తు కున్నప్పటికీ ఆమె అందం వన్నె తరగలేదు. వాసి చెడ లేదు. బిడ్డతల్లి అయిన తరువాత అదేమి చిత్రమో ఆమె అందం ఇనుమడించింది. యవ్వనపు మిసిమి, పడుచుతనపు పసిమి అప్పుడే ఆవిడలో కుదురుగా గూడుకట్టుకున్నట్టు అనిపించింది. అబ్బాయిపుట్టిన ఆరేళ్ళ తరువాత కూడా ఆమె అందచందాలు అలాగే ఉన్నాయి. బండి ప్రయాణం చేస్తున్నప్పుడు ఆ మసక చీకటిలో ఆవిడ తన అందాన్ని అంతా ఒక్కసారి తడవిచూచుకొంది. ఆమె బాహువులు, ఆమె ఉరము, ఆమె అధరములు, ఆమె ఊరువులు, పిరుదులు, పాదాలు, ఒక్కటేమిటి తన భర్తకు అత్యంత ప్రీతిపాత్రమూ, గర్వహేతువూ అయిన సర్వా వయవ సౌందర్యమూ ఆమెకు ఆ క్షణంలో ఎందుకో వెగటై పోయింది. తనంటే తనకు అనిర్వచనీయమైన, అతిగాఢమైన అసహ్యం కలిగింది. ఈ జుగుప్స ఆమెను కలవర పెట్టింది. కడుపులో చేయిపెట్టి దేవినట్లు అయిపోయింది. ఇంతలో ఏదో తీవ్రమైన భయము నరనరానికీ పాకిపోయింది. ఇంతలో ఆవిడకు అపూర్వమైన అవబోధ కలిగింది. తన భర్తగౌరవాన్ని, ఆయన వంశ ప్రతిష్ఠను కాపాడడంకోసం తానెంత త్యాగం చేయవలసిఉందో వెంటనే జ్ఞాపకం

వచ్చింది. అంతే. దెబ్బతిన్న పులుగువలె అతి దీనమైన ఆర్తనాదం ఆమె గొంతుక లోనుంచి వెలువడింది.

ఈ ఆడుకుయ్యి బయటతొట్టెలో కూర్చొని బండి తోలుతున్నవాడికి వినబడింది. ఇదేమిటా అని వాడు అక్కజ పడ్డాడు. మగతనిద్రలో జోగుతున్న అఖిలేశ్వరుడికీ ఇదివినబడింది. ఇదేమిటా అని అతనూ ఆశ్చర్యపడి లేచాడు.

అప్పటికప్పుడే అవిడ భర్తను వదలి బండి చివరకు జరిగిపోయింది.

''జగదా!'' అని అప్పుడే లేచి కూర్చున్న అఖిలేశ్వరుడు పిలిచాడు.

''జగదా!''

అప్పటికప్పుడే ఆమె మనస్సు మహామథనపడి పోతోంది. అటా? ఇటా? అని తీవ్రంగా ఊగులాడుతోంది. ఏదోతీవ్రమైన బాధ. ఆ పరిస్థితిలో అఖిలేశ్వరుడి మార్దవమైనపిలుపు మృదుల పరిమళ భరితమైన కుసుమ పరాగం వలె, తియ్యని సన్నని పాటవలె ఆమెలో తమ వైవాహిక జీవితానికి సంబంధించిన మధురస్మృతుల నెన్నింటినో రేపెట్టింది. అయితేనేమి? అప్పుడామె మనస్సులో జరుగుతున్న తర్జన భర్జనల తీవ్రతముంతు ఇదేపాటిది? అలనాటి తియ్యతియ్యని జ్ఞాపకములు వచ్చినవి. వచ్చినట్లే మాయమై పోయాయి. నిజమే. అప్పుడా సమయంలో ఆమెకు అభి

మాన పురస్సరమైన అనునయం చాలా కావాలి. (ఇంతకీ భర్తకంటె అనునయించగల దక్షు డెవడు?) ఏదో అనిర్వచనీయమైన నిగ్రహం ఆమెను ఆవహించి అణచిపెట్టినట్టు అనిపించింది. మనసూ, మాటా కూడగట్టుకొని మర్యాదకైనా బదులు చెప్పలేకపోయింది. అప్పు డామెస్థితి అతి విచిత్రమైనది. వట్టి వైరుధ్యాల పుట్ట. భర్తకు భౌతికంగా అతి సన్నిహితంగా ఉంది. అయితేనేమి, ఆయనకూ, తనకూ అనేక లోకాల అంతరం. తన సరసనే తన కాంతుడున్నాడు. కాని తన కెక్కడలేని ఏకాంతము. భౌతికమైన ఆకర్షణకు, మానసికమైన వికర్షణకు మధ్య మహాసంగ్రామము. ఈ విరుద్ధశక్తులమధ్య ఇరుకుకున్న ఆమె మనస్సులో క్షీర సాగర మథనమే జరుగుతోంది.

"జగదా! మెలకువగానే ఉన్నావా?"

ఆ మసక చీకటిలో, ఆ బండికుదుపులో అతడు తన రెండుచేతులూ ముందుకు చాచి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

"ఊఁ" అంది ఆవిడ నీరసంగా.

"ఎవరో హఠాత్తుగా ఏడిచినట్లు వినబడింది. నా ప్రక్కనే ఇక్కడే ఎవరో ఏడిచినట్లయింది. నువ్వేనేమో అనుకున్నాను."

"అబ్బే! నేనుకాదు"

"అలాగంటే ఎలా, నా చెవులారా విన్నానే మరి?"

"అబ్బే! బహుశా ఊరకుక్క ఏదైన నేమో? లేకపోతే గాలివాలున అలా ఊరికేనే వినిపించిందేమో!"

"పోనీలే! దగ్గరకు జరుగు."

ఆవిడ వెనక్కు ముడుచుకొంది. ఆవిణ్ణి దగ్గరకు లాక్కుంటూ అఖిలేశ్వరుడు తను ముందుకు జరిగాడు. ఇతను దగ్గరసా వస్తున్నకొలది ఆవిడ దూరదూరంగా తొలగిపోతోంది. ఎప్పుడైనా శరీరాలు తగిలినప్పుడు ఆవిడ అంత హుషారుగా సుముఖంగా ఉన్నట్టు అతనికి అనిపించడం లేదు. పైగా దూరంగా వైదొలగిపోతోంది.

"ఏమిటీ వరస?"

"ఏమీలేదు"

ఆవిడ గొంతుకలో మాట గొంతుకలోనే ఉండి పోయింది. బ్రహ్మాండంమీద బయటకు పెగిలివచ్చింది. అదైనా బలవంతంగా పెద్దగా రహస్యం చెప్పుకున్నట్టు ఉంది. కాని దోవనపోతున్న బండిలో ఒకరి సరసనే మరొకరు సన్నిహితులుగా ఉన్న భార్యాభర్తలు మాట్లాడుకున్నట్టు లేదు.

అఖిలేశ్వరుడు రెండు చేతులూ ముందుకుచాచి ఆమెను చేరదీసి అక్కునచేర్చుకొని ఆమె ముఖాన్ని తీవ్రంగా, సూక్ష్మంగా, దగ్గరగా పరిశీలించాడు. ఆమె కన్నులు మూసుకొనిఉంది. ఆ కన్నులను చేతితో తడిమిచూడగా

కనుగొలకులు తడిగా ఉన్నాయి. ముక్కుపుటాలు అదరి పోతున్నాయి. ఆ సమయంలో ఆమె కనులవెంట కారుతున్న అశ్రువులను చూచి అతడు అదరిపోయాడు.

"జగదా! ఏం, ఏడుస్తున్నా వెందుకూ?"

ఆ భారమంతా ఆమెదే. ఆ సమయంలో ఆవరించిన నిరాశా నిస్పృహా ఏమిటో కేవలం ఆమెకే తెలుసు. ఆ విధంగా పతి కౌగిలిలో కరగిపోతూ, ప్రణయార్ద్రంగా అతని వక్షస్థలంమీద ఆనుకొని ఉండడం ఆ సమయంలో ఆమెకు దుస్సహమనిపించింది. నళినీ దళగత జలబిందువు వలె తరళమూ సరళమూ పరిశుద్ధమూ అయిన అతని మృదు స్పర్శ ఆమె శరీరంలో అణువణువునీ దహించివేస్తున్నది కాని, దానినంటిన పాప పంకిలాన్ని క్షాళనం చేయలేక పోతున్నది. దేవతలనుసైతం పునీతంచేయగలిగిన ఆయన పారిశుద్ధ్యం ఆమెలో మరింత పాపినన్న ఆవేదనను కలిగించింది.

"అబ్బే! నేను వట్టి తెలివితక్కువదాన్ని కదా!" ఆవిడ అబద్ధమాడింది. "అవి దుఃఖాశ్రువులు కావు. ఆనంద బాష్పాలు. ఎందుకంటే మీతో కలసి ఇంతదూరం ఇలా ఒంటరిగా ప్రయాణం చేయడం, కాపరానికి వచ్చిన ఇన్ని నాళ్లకు ఇదే మొదలుకదా? అందుకని బండిలో మీరూ, నేనే అంతే కదా. కాని..."

"ఏమిటది ?"

"మన అబ్బాయికూడా మనతో వచ్చి ఉండవల సింది! అప్పుడు బహుశా..."

"ఔను! మరే!"

"అబ్బే! ఏమీ లేదు. మీరు బండినుంచి ఉరికి అలా పరుగెత్తుకు వెళ్ళినపుడు ఒక్క_త్తెనూ ఉన్నానుకదా! మనస్సు అదోలా అయిపోయింది. పరిపరివిధాల ఆలోచనలు పోయాయి. మీకు నడుంపోటువచ్చి మంచం ఎక్కినపుడు నా మనస్సులో ఏదో చెప్పరాని భయం ముసురుకుంది. క్షణంలో అంతా అయిపోయినట్లు అనిపించింది. నన్ను నేనే మరచిపోయాను. మీరు తిరిగి రావడానికి ఆలస్యమైన కొలదీ నాలో భయం పెరిగిపోయింది. ఏమని చెప్పను! ఇంతకీ అస్థికల పాత్ర అలాపడిపోవలసిన అవసరం ఏమిటి? చచ్చిస్వర్గాన ఉన్న మీనాయనగారి మీద..."

"హుష్! అవేంమాటలు? అదేమిఒట్టు? అలాంటి ఒట్టు ఎప్పుడూ పెట్టుకోకు." అంటూ అఖిలేశ్వరుడు ఆవిణ్ణి మరింత దగ్గరగా లాక్కున్నాడు. అర్థం పర్థం లేకుండా, ఒక దాని కొకటి సంబంధం లేకుండా చెబుతున్న ఆవిడమాట లను విన్నకొలదీ విస్మయ పడుతూ—

"హమ్మయ్య! దేవునిదయవల్ల మొత్తానికి ఎల్లాగై తేనేం అది దొరికిందిగదా!"

"హమ్మయ్య! అవును! దేవునిదయవల్ల" ఆవిడ అవే మాటలను చిలుకవలె పలికింది. అందులో ధ్వనితమైన వ్యంగ్యం అక్కడే ఆగిపోయింది.

అప్పటివరకూ తొట్టిలో కూర్చుని బండి తోలుతూ ఒక చెవిని ఇటుపారవేసి వింటున్న బండివాడు లోనున్నవారు మాట్లాడుకోవడం మానివేసినట్లు తెలుసుకున్నాడు.

# ఏడు

ఎద్దులు మెల్లిగా నడుస్తున్నాయి. బండివాడు పగ్గము లను బిగబట్టకుండా వదలిపెట్టాడేమో, అవి తోకలతో దోమలను తోలుకుంటూ బద్ధకంగా బండిని ఈడుస్తున్నాయి. బరువుగా బుసలుకొడుతూ నురగ నెమరులు వేసుకుంటూ ముందుకుసాగుతున్నాయి. గాలికూడ స్తంభించిపోయింది. ఆ ఉక్కకు తట్టుకోలేక కీచురాళ్లు చెవులు గింగురుమనేటట్టు గీ పెట్టుతున్నాయి.

తొట్టెలో ఓరగిల కూర్చున్న బండివాడు అక్క-డెక్కడో వెన్నెల అంచులలో కరగిపోతున్నట్లున్న దూర తీరాలను చూస్తూ చూస్తూ చుట్టవెంట చుట్ట ముట్టిస్తూ పొగపీలుస్తున్నాడు. ఇంతలో ఆ తెల్లవారుఝామున దోవ ప్రక్కనే ఉన్న పెరటిలోనుంచి ఒక కోడిపుంజు కొక్కొరో కో అని విషాదంగా కూత వేసింది. ఆ తరువాత కొంచెం నిశ్శబ్దం. దారి చీల్చుకుంటూ మొదటిదాని కూతకు ప్రతి ధ్వనో అన్నట్లు ఇంకొక కోడి దూరంనుంచి బదులుకూసింది. ఈ కోళ్ల కూతలు బండివాడికి చాలా చికాకు కలిగించాయి. తన్ను ఆవరించిన బద్ధకాన్ని మెల్లిగా దులుపుకుంటూ మందకొడిగా నడుస్తున్న ఎద్దులను అదలిస్తూ వాటి తోకలు మెలిపెట్టాడు. పగ్గాలు బిగలాగాడు. వెంటనే ఎద్దులు పరు

గెత్తడం మొదలుపెట్టాయి. దూరాన అరుణోదయ రేఖలు పొడసూపుతున్నాయి. త్వరలో అవతరించనున్న సూర్య భగవానుణ్ణి ఆహ్వానించడానికో అన్నట్లు ఎద్దులు తొందరగా ముందుకు పోకడం ప్రారంభించాయి. చుట్టూ వున్న కొండలూ, వాటిమధ్య ఉన్న పొలాలూ అన్నీ వెలుగురేకలతో నిండిపోయాయి. బండిచక్రాలు కిరకిరమంటూ ముందుకు దొర్లిపోతుండగా స్టేషన్ వచ్చేసింది. ఇంకా రెక్కవాలలేదు. దాని వెనకాల దీపం ఎర్రగా వెలుగుతోంది. 'హమ్మయ్య' అనుకున్నాడు. బండివాడు ఎంతో సంతోషించాడు. బండికి అందించగలిగినందుకు తన్నుతానే అభినందించుకున్నాడు. తనకష్టం ఫలించిందనీ, కూలిడబ్బులు గిట్టుతాయనీ అనుకున్నాడు.

అందరూ బండి దిగారు. బండి ఇరుసుకు కట్టినముంతను అఖిలేశ్వరుడు మెల్లిగా విప్పుకున్నాడు. బండివాడు సామానంతా నెత్తిన పెట్టుకొని ''బుకింగ్ ఆఫీసు'' ముందర వసారాలోకి చేర్చాడు.

అఖిలేశ్వరుడు బండివాడి చేతిలో బాడుగ పోశాడు. ఎంత ఇచ్చారో అని వాడు లెక్కపెట్టుకున్నాడు. చూస్తే ఒకరూపాయి ఎక్కువవుంది. ''అదేమిటి బాబూ రూపాయి ఎక్కువిచ్చారు'' అన్నాడు.

''అచ్చే! ఏంలేదు. అస్థికల పాత్ర భద్రంగా దొరికినందుకు సంతోషంగా ఇచ్చాను. ఉంచుకో.'' అన్నాడు అఖిలేశ్వరుడు. బండివాడు ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు.

ఆ ముఖంలో జేవురించి పొటమరించిన కృతజ్ఞత అఖిలేశ్వరుడికి నచ్చింది. "క్రూరవాడైతేనేమి" అనుకున్నాడు.

"పదిరోజుల తరువాత సాయంత్రం రైలులో మళ్ళా తిరిగివస్తాము. మమ్మల్ని తిరిగి తీసుకువెళ్ళడానికి వస్తావా?"

బండివాడు ఏదో ఆలోచిస్తున్నట్టున్నాడు. ఉలక లేదు. పలకలేదు. మొహం ఇంకా అటుప్రక్కకే త్రిప్పుకొని ఉన్నాడు.

"ఇంతకీ ఏమంటావు ? వస్తావా ? రావా ? ఏమిటి ? వెంటనే చెప్పు. రైలుకు వేళవుతోంది. ఇంకా టిక్కెట్లు కొనుక్కోవాలికూడాను."

"ఇవ్వాళిటికి పదిరోజులా ? అంటే ఏంవారం? సంత రోజుకు మూడోనాడుకదూ. గురువారం సరే."

ఇంతలో దూరాన రైలుకూత వినబడింది. బండి వేగానికి వంతెన అదురుతోంది. రెక్కవాలింది. పచ్చదీపం ప్రకాశించింది. అఖిలేశ్వరుడు బండివాడికేసి చూస్తుండగా పచ్చదీపం ఎర్రగా మారిపోయింది. అది అప్పటికప్పుడు అన్నివైపులకూ పాకిపోతున్న రక్తపు మరకవలె జేగురు ముద్దవలె కనబడి క్రమంగా విరిగిపోయింది. అలా ఉండగా అతనికి హృదయ విదారకమైన ఆర్తనాదం వినిపించింది. కలగంటున్న వాడివలె వెలవెలపోయిన మోముతో అతను ముందుకు బయలుదేరాడు. ఇంతలో ప్లాటుఫారంమీదకు రైలు రానేవచ్చింది.

## ఎనిమిది

రైలులో ప్రయాణం చేస్తున్నంతసేపూ జగదాంబ పరధ్యానంగానే వుంది. ఇంతకూ ఆవిడకువచ్చిన జబ్బేమిటో అఖిలేశ్వరుడికి అంతుపట్టలేదు. ఎంతో ఆపేక్షగా ఆదుర్దాగా అతడు అడిగిన ప్రశ్నలన్నింటికీ ఆమె ముభావంగా ఆఁ ఊఁ అంటూనే జవాబు చెప్పింది. మాట్లాడితే నోటిముత్యాలు ఎక్కడ రాలిపోతాయో అన్నట్టు, గుచ్చిగుచ్చి అడుగగా "దానిదేముంది లెద్దురూ, అదేపోతుంది పోనిద్దురూ! దీనికింత బెంగదేనికి?" అనేది. ఇలా మూడురోజులు రైలులో గడిచిపోయాయి. తెల్లారితే దిగవలసిన ఊరు వస్తుందనగా ఆ రాత్రి అఖిలేశ్వరుడు జగదాంబను గోముగా అడిగాడు.

"నా మీద కోపం వచ్చిందా?"

"అబ్బే! అదేంలేదు. కోపం దేనికి?"

"మరి ఇన్నిరోజులుగా నువ్వు ఆలోచిస్తున్నదేమిటి?"

"ఊహించుకోండి"

"ఉహూఁ, ఏమిటో తెలియడంలేదు. నేనే ఓడిపోయాను. చెబుదూ"

"దానికేం భాగ్యం. కాశీలో మనం చూడబోయే వింతలను గురించే" అంది ఆవిడ నదురూబెదురూ లేకుండా.

"నిజమా ?"

ఆవిడ అసలు సంగతి తనకు చెప్పకుండా దాచిపెడు తున్నదన్న అనుమానంతో అఖిలేశ్వరుడు ఆవిడ మొహం లోకి గుచ్చి గుచ్చి చూశాడు. మనస్సులో మథన ప్రారంభ మైంది.

కిటికీ ప్రక్కనే కూర్చుని, అస్తమిస్తున్న చంద్రుణ్ణి వెలుగునీడలలో దోబూచులాడుతున్న ప్రకృతిదృశ్యాలనూ ఆవిడ అదేపనిగా చూస్తున్నట్టుందిగాని నిజానికి ఆవిడ ఏమీ చూడటమే లేదు. మనస్సు అన్యాయత్తంగా ఉంది. తా నెప్పుడూ ఎవ్వరికీ ఏవిధమైన అపకారము చేయలేదే! తన కెందుకీ వేదన? ఇలాంటి దుర్భరదుఃఖాన్ని అనుభవించ వలసిందని బ్రహ్మ తన నొష్టను వ్రాశాడా ? కనుగొలకుల నుంచి వేడికన్నీరు బొట్లు ఏకధారగా బుగ్గలమీదికి ప్రవ హిస్తున్నాయి. అయితే రైలుపోతున్నప్పుడు రయ్యిమని వీచేగాలికి అవి అక్కడికక్కడే చల్లనై ఎప్పటి కప్పుడు ఇగిరిపోతున్నాయి. ఆవిడ చీరకొంగుతో కళ్ళనీళ్లు ఒత్తుకుంది. ఇలా ఉండగా ఒకటిరెండు సంవత్సరాల క్రితం జరిగినసంగతి ఒకటి ఆమె మనస్సులో చటుక్కున మెరిసింది. ఆ సంగతి జ్ఞాపకం వచ్చీరావడంతో ఆవిడ ఆపాదమస్త కమూ చలించిపోయింది. దుర్వాంఛలకు ఆమె లోబడ పోయిన దుర్ముహూర్తం అది. కాలం గడిచిపోయింది. సంవ త్సరాలు దొర్లిపోయాయి. కాని హఠాత్తుగా కాలగమనం

నిలిచిపోయింది. మళ్ళీ ఆనాటి మధ్యాహ్నం జరిగిందే ఇప్పుడు పునరావృత్తమైంది.

ఆనాడు జగదంబా, చిన్నాడపడుచూ ఇద్దరూ చేతులకూ కాళ్ళకూ గోరింటాకు పెట్టుకుని ఇంటి వసారాలో కూర్చున్నారు. కదిలితే ఎక్కడ రాలిపోతుందోనని కాళ్లూ చేతులూ బిగపెట్టుకుని, ఎవరిచేయి ఎక్కువ పండుతుందో అని పోటీలమీద పంతగించి కూర్చున్నారు. అలా కూర్చునే కులాసాగా కబుర్లు చెప్పుకుంటూంటే నల్భై అయిదు నిముషాలు గడిచిపోయాయి. ఆ సమయంలో సోదె మనిషి లోపలికి వచ్చింది. ''పచ్చకొండలనుంచి, పగడపు దీవులనుంచి ఇల్లువదలి ఇంత దూరం వచ్చానో వచ్చాను'' అంటూ పాటపాడింది.

సోదెచెప్పే మనిషి పడుచుతనపులోకంలో అప్పుడే ప్రవేశించింది. మనిషిలో పసితనం ఇంకా పారిపోలేదు. పక్షి దృష్టివలె మహానిశితమైనది ఆమెచూపు. మెడనిండా రంగు రంగుల పూసలదండలు, నెత్తిమీద బుట్ట, బుట్టలో స్వర్గాది సప్తఊర్ధ్వలోకాలు, పాతాళాది సప్త అధోలోకాలూ అణగిపడి ఉన్నాయి.

''బంగాళంనుంచి, సింహాళంనుంచి ఇల్లువదిలి ఇంత దూరం వచ్చానో వచ్చాను'' అని మళ్ళీ పాట పాడింది.

''ఎందుకు?'' అని అడిగింది ఆవిడ పదిన కొంటెగా.

"ఎందుకేమిటి? చల్లనితల్లులు మిమ్మల్ని అందరినీ చూద్దామని, ధర్మతల్లుల చేతులు చూద్దామనీను" అంది నవ్వుతూ. ఆ సమయంలో సోదెమనిషి కళ్ళు మిలమిలా మెరసిపోతున్నాయి. ఏడేడు లోకాలనూ దాచిన తట్టను మెల్లిగా దింపుకొని వసారాకు చివర ఒకవారగా కూర్చుంది.

ఆవిడ వదిన తనచేతిని ముందుకుచాచి చూపించింది.

"ఈ చెయ్యి ఇలాఉంటే ఎలాచూడను? చేతినిండా గోరింటాకు ముద్దలాయెను. ఏం, నాతో వేళాకోళమా మీకు?" అంది సోదెకత్తె కోపంగా.

వెంటనే చేతులు రెండూ బాగా కడుక్కు వచ్చి చూపించింది. వెంటనే సోదెకత్తె అందుకుంది. చిత్రచిత్రమైన రాగవరసలో ఎలుగెత్తి గద్యం, పద్యం అన్నీ మిళాయించి భావిభాగ్యాన్ని గురించి చాలాసోదె చెప్పింది. ఆరోగ్యం, ఆయుర్దాయం, భోగం, భాగ్యం, సంతానం, సౌభాగ్యంఅన్నింటిని గురించీ చెప్పింది. పదిమంది పిల్లల తల్లివవుతావనీ, నిండా నూరేళ్ళు బ్రతికి పుణ్యక్షేత్రంలో పరమేశ్వరునిలో కలిసిపోతావనీ ఇంకా ఏమేమో చెప్పింది. పైగా పెట్టి పుట్టిన పుణ్యశాలినివనీ, చేతిలో మామూలు రేఖలే కాకుండా శంఖ, పద్మ, రథ ముద్రలున్నాయనీ, ఇప్పుడిప్పుడే ధనుస్సుకూడా బయలుపడుతున్నదనీ, గట్టిగా నమ్మబలికింది. ఈ చేతిలో ఉన్న రేఖలను బట్టి ఒక ఏడాదిలో ఆత్మబంధువు లెవ్వరో రాలిపోతారని కూడా చెప్పింది.

ఈ జోస్యాన్ని బట్టి అప్పటికి పక్షవాతంతో మంచానపడి ఉన్న అత్తగారికి ఆయువు మూడిందని వదినగారు అనుకుంది. ఆవిడ అత్తగారంటే అత్తగారా, గయ్యాళిగంపగాని. కాలూ చెయ్యీ పడిపోయి కుక్కిలోపడి వేలాడుతోంది, గాని నోరుమాత్రం మునపటిలాగే మహావాడిగా ఉంది. ఆ పరిస్థితిలోకూడా ఆవిడ చేసే ఆరళ్ళూ, పెట్టే కోడంటి కమూ దుర్భరాలు.

ఇంక తన వంతు వచ్చింది. తనకేమో ఇష్టంలేదు. "నీదంతా బడాయి పోదూ" అని వదినగారు అననే అంది. బహుశా ఎవ్వరూ చూడకుండా, వినకుండా, తన చెయ్యి చూపించుకొని సోదె చెప్పించుకోవడం ఇష్టమేమో! ఏమైతే నేమి ఆ వదినగారు గబాగబా తన చేయిపట్టుకుని ముందుకులాగి సోదెలమ్మికి చూపించింది.

"జాగ్రత్తగా చూడు. అందరికీ ఒకటే సోదెచెప్పకు సుమీ" అని హెచ్చరించింది.

"అలాగేనమ్మా" అంది సోదెమనిషి. నవ్వుతూ, బుర్రఊపుతూ. ఆ వెంటనే చేతిని జాగ్రత్తగా పరిశీలించింది. అందులో ఏమికనబడిందో ఏమోకాని దాని అతివాగుడంతా ఒక్కసారిగా కట్టడిపోయింది. అంతటి వాచాలీ ఒక్కసారిగా మౌనిగా మారింది. అంతలో తమాయించుకుని, తన కళ్ళలో పొటమరించిన భయ విహ్వలతను కప్పిపుచ్చు కోవడం కోసంతల క్రిందికి వాల్చింది. గొంతు గద్గదికమైంది.

ఇదంతా వద్దన్నా తనకంట పడనేపడింది. తన గుండె గుభేలు మంది. దడవచ్చినట్లనిపించింది.

ఇదంతా చూచిన వదినకు చిరాకు ఎక్కువైంది. "నీ కేమొచ్చిందే నోరు మెదపడం మానివేశావు?" అని గద్దించింది.

"అబ్బే! ఏమీా లేదండి అమ్మగారూ! కొంచెం తల తిరిగి దిమ్మెక్కినట్లుఅనిపించింది. పొద్దున్నుంచి ఎండలో అదే పనిగా తిరుగుతున్నాను కాదాండి మరీ, అందుకని, ఆ వికారం, కడుపు, దిమ్మా అన్నీ సర్దుకున్నాయి లెండి."

"సరే! అయితే ఇంక చెప్పుమరి."

"ఇదెంత మంచి చెయ్యి!" అంటూ సోదెమనిషి మొదలు పెట్టింది. "నిజం నిజం! గోరింటాకు పెట్టుకుందిగా మరీ ముద్దొస్తూఉండాలి. ఈ సోదిఅంతా కట్టిపెట్టి అసలు సంగతి త్వరగా చెప్పు." అంది వదినగారు కర్కశంగా.

"ఓ! భోగ భాగ్యాలకు లోటేం లేదు కానీండి సంతానం మాత్రంతక్కువ. ఆట్టేమంది ఉండరు——ఈ విధంగా చెప్పిందే చెప్పుకు వస్తోంది. దాని ధోరణి అంతా చూస్తే అదోలాఉంది. ఆ చెప్పడంలో మొదట ఉన్నంత హుషారూ అవీ ఏమీా కనబడడంలేదు. ముఖ్యమైన దేదో చెప్పకుండా దాచిపెట్టినట్లు అనిపించుతోంది.

"త్వరలోనే ఈవిడకో పెద్దగండం ఉన్నట్టుకనబడుతోంది."

త్రిప్పి త్రిప్పి డొంకతిరుగుడుగా చెప్పింది. "శరీరానికి అంటు సోకుతుంది ......" "అంటూ"

"అంటే పొంగా, ఆటలమ్మా, మశూచా? ఏమిటి? సరిగా చెప్పు" అని వదినెగారు గద్దించింది. "ఆవిడకు ఇదివరకే పొంగూ, ఆటలమ్మా కనబడ్డాయి. మశూచి అంటే కాస్త ప్రమాదమే." అంటూ వదినెగారు ఏమేమిటో చెప్పుకు పోయింది. ఇదందా సోదెమనిషి వినిపించుకోలేదు. తనలోతాను ఏదో గొణుగుకుంటోంది. ఇంతలో ఆమె కళ్లు మళ్లీ భయ విహ్వాలమయ్యాయి.

"కొండలా విరుచుకు పడుతుంది. బెండులా తేలిపోతుంది. పోదామరి! ఇంతకీ రానున్నది రాకమానదు. జరుగనున్నది జరుగకమానదు. జరిగి తీరవలసిందే."

నిజమే సోదెమనిషి జరుగనున్న దానిని సరిగానే చెప్పింది. మెల్లగా చల్లగా చెప్పితేనేమిగాక! ఆమాటలను తేలికగా కొట్టిపారవేయడానికి లేదు. ఇప్పుడీ ఉద్రేక పరవశమైన పరిస్థితిలో ఆనాడు సోదెమనిషి చెప్పిన పలుకులు చెవిలో ప్రతిధ్వనిస్తున్నాయి. ఇంతకీ ఈ ఘటం మట్టిలో కలిసిపోయే సమయం వచ్చిందనుకుంది. అలా అయిపోయినా బాగుండును. కాని తన కోరిక ఎంత తీవ్రంగా ఉన్నప్పటికీ తన శరీరంమీద తనకెంత అసహ్యం కలిగినప్పటికీ

ప్రాణంపోలేదు. ఇంకా బొందెనే అంటిపెట్టుకుని ఉంది. తన మనస్సును ఎంత కేంద్రీకరించుదామన్నా పదే పదే అది వశంతప్పి మామూలుగాడిలో పడిపోతున్నది. రైలుపెట్టెలో నేలమీద పోగులుపడ్డ తుక్కు, చుట్టూ దోమలు ముసిరిన దీపం. తోటిప్రయాణీకుని దుస్తుల తీరూ, ఎదురుగుండా కూర్చున్న ఆవిడ ముగ్గిపెదవీ, ఎంతసేపూ వీటి మీదనే దృష్టిపోతోంది. ఇలాంటి ఆలోచనలు తనకే వస్తున్నాయా, లేక ఇంక ఎవరికైనా కూడా వస్తున్నాయా? అని ఆశ్చర్య పడింది. ఇంతలో ఆలోచనలన్నీ ఆగిపోయి మనస్సులో శుద్ధశూన్యం ఏర్పడి పోయింది. ఆలోచించి ఆలోచించి అలసిపోయింది. ఎత్తైన కొండకొమ్ముమనుంచి అంతులేని అగాధంలోకి అంతకంతకూ అతిశయించిన వేగంతో పతనమై పోతున్నట్లు అనిపించింది. బండి కుదుపుకి ఆవిడ తల అల్లలాడి పోతుండడాన్ని అఖిలేశ్వరుడు గమనించాడు. మెల్లిగా లేచి మళ్లీ నిద్రపోయింది.

పదములసవ్వడి, మాటలరాయిడి, అంతలో తననుంచి ఆ అడుగులు క్రమంగా దూరమైపోతున్నట్టు అనిపించింది. తా నెక్కడుందో ఆవిడకు ఆ సమయంలో తెలియదు. కాని తన బుర్రలోనే ఈ అడుగుల సవ్వడి అంతాను. ఈ మాటలు రాయిడి తన చెవిలోనే. ఈ రొద భరించలేక తన సర్వేంద్రియాలనూ, సకల శక్తిని కూడగట్టుకొని గట్టిప్రయత్నమే చేసింది. భయంతో ఆవిడ గొంతుక ఎండిపోయింది. అతికష్టంమీద మాట పెగిలింది. భయంతో

బొంగురుపోయిన కంఠంతో, చిన్నప్పుడు తల్లిదండ్రులు తనకునేర్పిన కులదేవతా ప్రార్థన ఉచ్చరించడం మొదలు పెట్టింది. గ్రామంలో అందరికీ విషూచి వచ్చినప్పుడు ఒక సారి ఆవిడ ఇలాగే కులదేవతకు మ్రొక్కుకుంది. కుటుంబంలో అందరినీ ఆవిడ అనుగ్రహించి ఆశీర్వదించింది. అందరిళ్లలో అందరికీ అన్నీ వచ్చినా వాళ్ల ఇంట్లో మాత్రం ఎవ్వరూ జబ్బున చీదలేదు. అలాగే తమఇంటి పొరుగున ఉన్న శ్రీమంతుని ఇంటిలో కాగడాలతో కన్నపుదొంగలు ఆస్తి అంతనీ దోచుకుపోయారు. సంపదలో వారికి వీరేమీ తీసిపోరు కాని ఆ దొంగలు మాత్రం వీరింటికేసి తొంగి అయినా చూడలేదు. ఎప్పుడే ప్రమాదం వచ్చినా ఆవిడ చేతులు జోడించి అమేయమైన భక్తిభావంతో తన కుల దేవతను ప్రార్థించేది. అంతే. మంత్రించినట్లుగా ఆ ఆపద అలా అలా తేలిపోయేది. ఆవిడ ప్రార్థన లెప్పుడూ వృథా కాలేదు. ''దేవుడా రక్షించు! ఆపన్నివారకా! కాపాడు'' అంటూ ఆవిడ అంతరాంతరాలలోనుంచి ప్రార్థించింది. అయితే ''అమ్మా, అమ్మా, నన్ను నీతో తీసుకుపో! నేను ఇక్కడ ఉండను! అమ్మా, నన్ను నీతో తీసుకుపోవమ్మా'' అని ఏడ్చే పసివాడి రోదనం ఆసమయంలో ఆవిడ చెవులలో పడింది. ఇంతలో మరుక్షణంలోనే ఆ దృశ్యం మారిపోయింది. ఆమెభర్త, కొడుకు, తల్లీ, ఇతర సన్నిహిత ప్రియబంధు మిత్రజాలమంతా ఎందుకో శోకాకులితులై పరిదీనవదనా లతో ప్రత్యక్ష మయ్యారు. కాని అంతలోనే ఆవిడకు

అసలు సంగతి తెలిసినట్లయింది. భీతహరిణంవలె ఆమె కళ్లు తెరచి చూచేసరికి విజయ గర్వంతో పరవశములైన రెండు రక్తారుణనేత్రాలు ఆమె ముఖంలోకి గుచ్చి గుచ్చి చూస్తుండడం కంటబడింది. భయంతో ఆవిడ కుంచించుకు పోయింది. వెనక్కు విరుచుకుపడింది. ఇలా ఉంటూండగా తన మూతిమీద నున్న మరో మూతిలోనుంచి దుర్వాసన గుప్పున కొట్టింది. తాను ఎంత పెనగులాడినా లాభం లేకపోయింది. పెనగులాడి పెనగులాడి అలసిపోయింది. దాంతో బాధగా, జాలిగా మూలిగింది. ఇదంతా ఆమెను పట్టి పీడిస్తున్న దుష్టస్వప్న దృశ్యం. భౌతికంగా బాగా అలసిపోయి ఉందేమో ఈ దుస్స్వప్నపు దృశ్యాలకు ఆవిడ బాహ్యనిద్ర చెదరలేదు. కాని ఒకటి రెండుసార్లు మాత్రం ఏడ్చిఏడ్చి పడుకున్న పిల్లలు నిద్రలోకూడా వెక్కి వెక్కి ఏడ్చినట్లు ఉలిక్కిపడింది.

దేవాలయం తలుపులు మూసిఉన్నాయి. లోన దీపం ఏదీ వెలగడంలేదు. గంటలుకూడా నిశ్శబ్దంగానే వ్రేలాడు తున్నాయి. గర్భ గుడిలో గబ్బిలాలు పచార్లుచేస్తున్నాయి. నిన్న పూజచేసిన పువ్వులు వాడిపోయాయి.

మానభంగం జరుగనున్న సమయంలో ద్రౌపది ఎవరిని ప్రార్థించింది? ఆమె మొరాలకించి కాచి బ్రోచిన వాడే దేవుడు? బహుశా ప్రస్తుత దుస్థితి అంత తీవ్ర మైనది కాకపోవచ్చు! స్వయంగా భగవంతుని దృష్టినీ,

దయనూ ఆకర్షించగల ప్రమాదకరమైనదీ, శక్తిమంత మైనదీ కాకపోవచ్చు. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అని అప్పుడు చెప్పినమాటలకు ఇప్పుడా దేవుడు బృందావనంలో గోపికలచెంత తీరికగా చింతిస్తున్నాడేమో! నేరకపోయి చెప్పాననుకుంటున్నాడేమో? ఇంతకీ ఆ మాటను సార్థకం చేయగలంతగా పాపాలు పెరగకపోవడం యుగదోషం తప్ప అన్యంకాదు.

మానవుని దృష్టిలో అందమైనదీ, సమగ్రమైనదీ సృష్టికర్త దృష్టిలో అందమైనదీకాదు, సమగ్రమైనదీకాదు. ధాత ఎవరి కర్మలప్రకారం వాళ్ళను సృష్టించాడు. వాళ్లు ఒకవేళ దుర్మరణం చెందినా, లేక అసహజ క్షయానికి గురి అయినా దానిని యాదృచ్ఛికమైనదిగా భావించడానికి లేదు. అది వారివారి పూర్వజన్మ కర్మ విశేషం అనుకోవాలి. భగవదనుగ్రహంవల్ల జన్మ క్రమాన్ని దాటి పునరావృత్తి రహితమైన నిశ్శ్రేయసాన్ని చేరుకోగలిగినప్పుడే జీవికి సార్థక్యం. అప్పుడే అది సమగ్రమవుతుంది. అయితే ఆ మోక్షం ఎలా లభిస్తుంది? బహుశా ప్రస్తుత జన్మలో పాపాలేవీ చేయకుండా ఉండడంవల్లనే కావచ్చు. శిల్పి తన ప్రజ్ఞావిశేషంచేత కఠిన శిలలను మంచి మహనీయ సుందర దేవతామూర్తులను రూపొందించగలుగుతాడు. అనిర్వచనీయ అలేఖ్య తనూవిలాసినిమైన దివ్యాప్సరోభామను

సృష్టించాడనుకోండి. ఆ సుందరమూర్తిని, దాని రామణీయకాన్ని పదిమందీ పదివిధాలా మెచ్చుకునే సమయంలో ఒక కిరాతుడెవ్వరో హఠాత్తుగాలాగిపార వేసి శతధా, సహస్రధా ఛిన్నాభిన్నం చేసివేశాడనుకోండి. అప్పుడా శిల్పి కెలా ఉంటుంది? ఇదేదో ప్రమాదవశాత్తూ జరిగిందని నమ్మకం కుదిరిందనుకోండి. అప్పుడాతని సానుభూతి అంతా దోషిపైననే. కాని సృష్టికర్తమాత్రం, తాను రక్తమాంసాలతో సృష్టించి ప్రాణంపోసిన సుందరమూర్తులను మరెవ్వడో ధ్వంసం చేసివేస్తుంటే నిర్లిప్తుడుగా చూస్తూ ఉండగలడు. అలాకాకపోతే అలాంటి ప్రమాదాలు జరుగకుండా అరికట్టేవాడుకాడా? బహుశా మానవునివలె కాకుండా ఆ భగవంతుడు అసంఖ్యాకంగా అలాంటి సౌందర్యనిధులను సృష్టించగలడు. కనుకనే సృష్టించడమే ఆయనవంతు, ఆనక ఏమైపోయినా సరే. ఆయనకేమీ బెంగ లేదు.

ఆవిడ నిద్రపోతోంది కాని అదంతా కలతనిద్ర. ఆమె గతకాలపు స్మృతులూ, ప్రకృత సంఘటనలూ కలిసి కలకబారి పొంగులువారి ప్రవహిస్తున్న జీవనఝరీ కూలంపై తానొక్కతే ఒంటరిగా ఉన్నట్టుగా ఉంది.

ఇలా కొంతసేపు అయింది. తన భార్య ఆరోగ్యం ఇంతలో ఇలా విషమించిందేమిటా? అన్న ఆలోచనతప్ప అఖిలేశ్వరుడికి అన్యచింతన లేకపోయింది. తమ ఉభయుల జీవితాలలోనూ ఒక దుర్భరమైన అగాధం ఏర్పడిందన్న

సంగతిని ఆతడు ఏవిధంగానూ గమనించనేలేకపోయాడు.
కాలంగడచిపోతోంది.

వేళకు చేరుకోవాలన్న కోరికతో కాలంతో పందెం వేసి రైలు గర్జిస్తూ గబగబా పరుగెత్తుతోంది. మధ్య మధ్య తగిలే మకాముల సంగతీ, పెట్టెలలో ఉన్న మానవుల సంగతీకూడా దానికి పట్టనట్టే ఉంది. ఒకచోట పరుగెత్తీ, ఇంకొకచోట నెమ్మదిగా వెళ్ళీ ఎల్లాగైతేనేమి ఒక చోటకు వచ్చినిలిచింది. బ్రేకులునొక్కగా గీపెట్టుతూ నిలిచిపోయింది. ''బనారస్, బనారస్'' అని పోర్టరు కేకలు పెట్టాడు.

మొత్తానికి ఎలాగైతేనేమి అఖిలేశ్వరుడూ, ఆయన భార్యా అఖిల కల్మషహరమైన కాశికాపురిని చేరుకున్నారు.

# తొమ్మిది

ఆరోజు పొద్దున్న ఆకాశం నిర్మలంగా ఉంది. గాలి చల్లగా మెల్లగా వీస్తోంది. వాతావరణం సుఖోష్ణంగాఉంది. వీరికి స్వాగత మివ్వడంకోసం స్టేషనుకువచ్చిన కులబ్రాహ్మణుడు హడావిడిగా ప్లాట్ ఫారం అంతా కలయ దిరిగాడు. సంతోషమూ సంతృప్తీ ఆయన ముఖంలో తాండవిస్తున్నాయి.

అంతాకలిసి రెండు ఎక్కాలు కట్టించుకున్నారు. మొదటిదానిలో సామానుతోసహా పురోహితుడు కూర్చుని, ముందుగా పోనిమ్మన్నాడు. ఆయన వెనువెంటనే అఖిలేశ్వరుడు సతీసమేతంగా రెండో ఎక్కాలో ఎక్కాడు. రెండూ ఒకదానివెంట మరొకటి వెళ్ళుతున్నాయి. పవిత్ర గంగా తీరాన ప్రాగభిముఖంగాఉన్న ప్రాచీన మహాక్షేత్రం కాశీ నగరం. ఆ ప్రభాతసమయంలో నగరంలోని గుళ్ళు, గోపురాలు వింత వింత శోభలీనుతూ నగరసౌందర్యాన్ని ఇనుమడింపజేస్తున్నాయి. గుంపులుగుంపులుగా నగరవీధులలో కలయతిరిగే యాత్రికులు, సుదూరప్రాంతాలనుంచి వచ్చిన తైర్థికులు, పూర్వకాలపు ఋషులను తలపింప చేసే జటావల్కలధారులు, బవిరిగడ్డపు సాధువులు, చంకన జోలె, చేత కమండలముతో శాటీకౌపీనధారులైన బైరా

గులు, వీపున పిల్లలు, తలపై కుండలదొంతరలు, సామా నుల మూటలు పెట్టుకుని వయ్యారంగా నదీతీరానికి చేరుకునే భామినులతో నగరపు వీధులు కలకలలాడుతున్నాయి.

అఖిలేశ్వరుడు అన్వేషి కాడు. ఎక్కడ ఏమి జరుగు తున్నదో చూడాలన్న కుతూహలమూ తక్కువే. వేదాంతి వంటివాడు. సాధుస్వభావుడు. శాంతగంభీరమూర్తి. వార ణాసి అతనిదృష్టిలో ఆధ్యాత్మిక కేంద్రం. హిందువుల మతవిశ్వాసమునకు కాణాచి. ఆత్మోద్దీపనం కలిగించగల పవిత్రనగరం. ఈవిధమైన భక్తిభావంతో చూచేవాడికి అక్కడఉన్న లోపాలేమి కనుపిస్తాయి కనుక. వేదకాలం నుంచి నేటివరకు కాలవాహిని తాకిడులకు తట్టుకొని కాశికా పురి తరతరాలుగా భక్తులను అలరిస్తూనే ఉన్నది! అశేబి యర్ వృక్షముమీాది పక్షివలె అది అజరామరమైనది. నిత్యమైనది. నిత్యనూతనమైనది. బాబిలోనియాకంటె, నినివేకంటె, టైర్ ప్రాచీనమైనది. సైరస్ రాజుకు పూర్వమే పర్షియా సింహాసనానికి మెరుగులు దిద్దింది. సాలమన్ రాజుకు దంతులను, వానరాలను, నెమళ్ళను బహూకరించిన ఘనత వారణాసిదే. హిందూమతోద్ధారకుడైన ఆదిశంకరా చార్యుల వారు బౌద్ధుల మూఢవిశ్వాసాలను పటాపంచలు చేసిన పుణ్యభూమి ఇదే. కాశీ—ఎంత అద్భుతమైన పట్టణం. అఖిలేశ్వరుడి మనస్సులో ఆచార్య స్వామి రచించిన కాశీ స్తవ శ్లోక మాధుర్యం ఒక్కసారిగా మెరిసింది. ఏమో

ఇక్కడవెలాంటి మహదనుభూతులు తనకు కలుగబోతున్నాయో అనుకున్నాడు అఖిలేశ్వరుడు. ఈ శరీరమే పావన వారణాసీ క్షేత్రం. ఇక్కడే త్రిజగన్మాతయైన విజ్ఞానగంగ ప్రవహిస్తున్నది. ఈభక్తివిశ్వాసాలే గయాక్షేత్రం. నా గురు పాదస్మరణమే ప్రయాగ. సర్వప్రజల మనస్సాక్షియైన బ్రహ్మమే భగవానుడు. పరమేశ్వరుడు. విశ్వేశ్వరుడు. ఈవిధంగా సర్వ పుణ్యక్షేత్రాలూనాలోనే ఉన్నప్పుడు వేరే దేవాలయ మెందుకు? అసలు అలాంటి దేదైనా ఉందా? ఉందా ? తన సరసనే ఉన్న ప్రియురాలి దుఃఖంలో నిమగ్నమైన తన హృదయాన్నే అఖిలేశ్వరుడు ప్రశ్న అడిగాడు. దోవ పొడుగునా కనబడుతుండే గుళ్లనూ, గోపురాలనూ, కోటగోడనీ, ఇతర వింతలనూ చూపుతూ, చూడమని కోరుతూ అఖిలేశ్వరుడు తన అర్ధాంగికి ఉత్సాహం కలిగించడానికి యథాశక్తి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఆవిడనీరసంగా నవ్వింది. అదిచూచి మనిషి మళ్లీమనలో పడుతున్నదనుకుని ఆ వెర్రిబాగులవాడు ఎంతో సంతోషించాడు.

కర్మకాండ అంతా ముగిసిన తరువాత "మనం ఈ చుట్టుప్రక్కల వింతలూ విశేషాలు చూడడానికి వెళ్లుదాం. అవి చాలా బాగా ఉండి ఉండాలి'' అన్నాడు.

'అలాగే' అన్నట్లు ఆవిడ బుర్ర ఊపింది. నవ్వడానికి ప్రయత్నించింది. కాని అనురాగ పురస్సరంగా చేతిని నొక్కిన పతిని ప్రత్యుత్థానం చేయలేకపోయింది.

ఆ రోజు మధ్యాహ్నం తమకోసం కులబ్రాహ్మణుడు కుదిర్చిన దక్షిణాది పండా విడిదిలో అఖిలేశ్వరుడు తన అర్థాంగితో చాలాసేపు మాట్లాడాడు. ఏమైనా సరే ఆవిడ విచార కారణం తెలుసుకొని, ఆమెను ఏల్లాగైనా సంతోష పెట్టి తీరాలనే పట్టుదలతో మాట్లాడాడు.

"ఇంతకీ ఇక్కడ మనం కొనవలసిన వేమిటో ఆలోచించావా?" అన్నాడు తమ సంభాషణను ఉపక్రమిస్తూ.

"అవేమిటో, అక్కడికి అవేమిటో మీకు మహా తెలియనట్టు" అంది ఆవిడ.

"అన్నింటి కంటె ముందు నీకో బనారసు పట్టుచీర"

"అబ్బే, ముందుకాదు. ఆఖరున."

"ఏం?"

ఆవిడేమీ తర్కించలేదు, జవాబూ చెప్పలేదు.

"సరే! అయితే, అమ్మకి అందమైన చిన్న రుద్రాక్షలమాల. రెండు పెద్దమాలలు చెరో బాబయ్యగారికిన్నీ."

"భేష్, బాగుంది"

"త్రివేణి, గంగ చెంబులు పెద్దవీ చిన్నవీ, రాగీ, ఇత్తడీ కలిపి చేసినవి కొన్ని, విష్ణుపదముద్ర వేసిన అరివాణాలు, విశ్వనాథుడివీ, విశాలాక్షివీ పటాలూ, విగ్రహాలు, చిన్న చిన్న కుంకుమభరిణలు, అద్దాలు, దువ్వెనలు, వాటి

సంగతిసరే. మన బాబిగాడికి ఏమి కొనుక్కువెళ్ళదా మంటావు? అక్కడదొరకనిదేదైనా అయితే బాగుంటుంది. జరీబుటేదారీ పొదిగిన మొఖమల్లు పట్టుకుచ్చుల టోపీ కొనుక్కు వెళ్లుదామా?''

బాబిగాడిపేరు చెప్పేసరికి ఆవిడ కంఠం శోకరుద్ధమైపోయింది. చేతులతో ముఖం కప్పుకుని భోరున ఏడ్చింది. వెంటనే ప్రక్కగదిలోకి వెళ్ళిపోయింది.

''పాపం! బాబిగాణ్ణి కూడా తీసుకువచ్చి ఉండవలసింది'' అని తనలో తనే అనుకున్నాడు. వినపడీ వినపడనట్లుగా అఖిలేశ్వరుడు.

''అవును! ఆవిడ దుఃఖానికి అదేకారణం! తెలుస్తోందిగా! పిచ్చిపిల్ల'' అనుకున్నాడు.

# పది

ఇహలోకానికీ పరలోకానికీ బ్రతికి ఉన్నవారికీ మరణించిన వారికీ సంబంధం కలిపే రోజు అది. అది భూతాలకు సంతర్పణరోజు.

ఆ రోజు పొద్దున్నే మంచు కురుస్తోంది. మంచు ముసుగు వేసుకున్న మణికర్ణికా ఘట్టంలో అఖిలేశ్వరుడు అర్ధాంగితో సరిగంగస్నానాలు చేశాడు.

శ్రాద్ధం ప్రారంభమైంది. బ్రాహ్మణులు ఉచ్చైస్వరంతో వేదమంత్రాలు పఠిస్తున్నారు. వేదఘోషలో మునిగిన అఖిలేశ్వరుడు పితరులపట్ల శ్రద్ధాభక్తులతో, సమాధిగ్రస్తునివలె, లోకపు ధ్యాస లేకుండానే పారలౌకిక క్రియలన్నింటినీ నిర్వర్తించాడు. మధ్యలో ఒకసారి కాబోలు 'ధర్మపత్నీ సమేతస్య' అని పురోహితుడన్నప్పుడు తనకు చేదోడు వాదోడుగా తన సరసనే, వెనుకగా నిలిచిఉన్న భార్యకేసి చూశాడు. ఆ సమయంలో ఆమెను చూచి ఆశ్చర్యపోయాడు. ఆమెలో దివ్యతేజస్సు కొట్టవచ్చినట్టు కనబడింది. ఆమె దేవతామూర్తివలె వెలిగిపోతోంది. ఆమె అందంచూచి అలాగే నిశ్చేష్టుడై నిలిచిపోయాడు. ఈ సంగతి కులబ్రాహ్మణుడు కూడా చూచాడు. ఏం చెయ్యాల్లో

ఆయనకూ తట్టలేదు. నిన్ననేమో ఆవిడ తెల్లగా పాలిపోయి జబ్బుగా ఉంది. ఇవ్వాళేమో ఈ దివ్యతేజస్సు!

ఆమె బాధాతప్త హృదయంతో, తప్తకాంచనప్రతిమ వలె, దేవతామూర్తివలె వెలిగిపోతున్నది. ఆ సమయంలో ఆవిడ మనస్సు అంతా ఇంటిదగ్గర వదలివచ్చిన పసిపిల్లవాడి మీదనే ఉంది. తన చిన్న తమ్ముడివలెనే వీడు కూడా సన్నగా రోజురోజుకూ చిక్కిపోతున్నాడు. కాని ఆతడు మాత్రం తండ్రిగారి చిన్నతనపు గాథలను జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. ఆమె అత్తగారి పేరు చెబితేనే కోపం వచ్చింది. కుటుంబ వ్యవహారాలలో ఇంకొకరు వేలుపెట్టడం ఆ ముసిలావిడకు సుతరామూ కిట్టదు. ఆయన మహా ఆపేక్షగా ఉండేవాడు. ఎంతో ఇదిగా అందరిని గురించీ, అన్ని సంగతులూ అడిగి తెలుసుకునేవాడు. అయితే కొన్ని కొన్ని సందర్భాలలో మరీ చండశాసనుడుగా ఉండేవాడు. పిల్లవాణ్ణి అలా ఏడుస్తూ ఉండగా వదలి వెళ్ళినట్లు తెలిస్తే ఏ మాత్రం ఊరుకునేవాడు కాదు. ఒక్కగానొక్క కొడుకు. రెండో కానుపు కూతురు. పుట్టిన తరువాత ఏడాది తిరగక ముందే కాలం చేసింది. చెల్లెలిచావు వాడిలో లావు దుఃఖానికి కారణమైంది. చెల్లెల్ని గురించి ఈ చిన్నివాడు అస్తమానం అడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పేసరికి ఇంట్లో ఉన్నవాళ్ళందరికీ తలప్రాణం తోకకు వచ్చేది. అడిగినప్పుడల్లా ఏవో అబద్ధాలు చెప్పి మాయపుచ్చి పంపించేవారు. చెల్లెలు ఆటలాడుకోవడానికి అలాఅలా వెళ్ళిందని, మళ్ళీ

ఇంటికి రానంటున్నదని, ఒకటేమిటి, అనేక మాయలు చెప్పి పంపించేవారు. అలాంటిది ఇప్పుడు తల్లి అయిన తానే ఆ పసివాణ్ణి పెద్దగా మాయపుచ్చి ఈ లోకంనుంచి పారిపోవడానికి ప్రయత్నిస్తున్నది. ఆవిడలో మనోనిశ్చయానికీ, మాతృధర్మానికీ మధ్య తీవ్రమైన సంఘర్షణ జరుగుతోంది. ఈ గొడవలలో ఉన్న ఆవిడ చెవులకు సరసనే నిలుచుండి పురోహితులు చెవులు గింగురుమనేటట్టు చదువుతున్న మంత్రాలు ఎక్కడో దూరాన్నుంచి వచ్చినట్లు, తుమ్మెద రొదవలె సన్నగా చిన్నగా వినబడుతున్నాయి.

"సరే బాగానే ఉంది. నీవు భార్యవే కాకపోవచ్చు. కాని తల్లివి కాకపోవుకదా!" అంది ఆమె హృదయం.

"తల్లినీ! ఎలాంటి తల్లిని?" అంది బుద్ధి.

"జరిగిన దానికి నీ బాధ్యతేమీ లేదు. దానికి ఆకాశమే సాక్షి. నీవు బాధ్యురాలవు కానేకాదు."

"అంటుకుండ ఎప్పటికీ అంటుకుండే. చెడిపోయిన నెత్తురు ఎప్పటికీ చెడిపోయినదే. భార్యనైనా అంతే. తల్లినైనా అంతే."

"నిన్ను నువ్వు అంత అలా అసహ్యించుకోవడం అనవసరం. నిప్పునకు చెద లంటుతుందా ? నిప్పులాంటి నీ పావిత్ర్యం చెడిపోయిందంటే నమ్మడం ఎలా ? ధైర్యం తెచ్చుకో."

"ధైర్యమా ! అది వట్టి గజగజలాడే కుక్క."
"బుద్ధి! అది వట్టి మొరిగే కుక్క."
"ఏమి సాహసం? ఏమి సాహసం ?"

బుద్ధి, హృదయం, తర్కం, హేతువాదం, ఉద్రేకం, బ్రాహ్మణుల వేదఘోష, నదీప్రవాహం, దూరాన కనిపించే చెట్లు,గుళ్లు,గోపురాలు, స్తంభాగ్రాలు—ఒక టేమిటి యావత్తు విశ్వమూ ఆ క్షణంలో ఆమె మనస్సులో గిర్రున తిరిగింది. ఆ వెనువెంటనే ఆమెను నిశ్చలమైన ప్రశాంతత ఆవరించింది. నిశ్శబ్దంగా ఉండే గుహలో కలలుకంటూ ఒదిగి కూర్చున్న గువ్వవలె మృదువుగా, అచలంగా కూర్చుంది. ఆంతరంగిక మైన తర్జన భర్జనలన్నీ ముగిసి ఆమె ఏదో దృఢనిశ్చయానికి వచ్చింది. ఆమె మళ్ళీ మన లోకంలో పడింది. ఇంక ఆమెలో శరీరానికీ ఆత్మకూ మధ్య సంఘర్షణ అంతా చల్లారి పోయింది. చివరకు నీతిదే పై చేయి అయింది. ఆమెకు కావలసిన దేదో అది దొరికింది. ఆమె సిద్ధంగానే ఉంది. సమయం ఆసన్న మవుతోంది. శ్రాద్ధం కూడా ముగిసింది.

ఆమె భర్తతో కలిసి మణికర్ణికా ఘట్టంలో మెట్లు దిగింది. కుడిచేతితో తండ్రిగారి అస్థికల పాత్రనూ, ఎడమ చేతితో భార్యనూ పట్టుకొని అఖిలేశ్వరుడు నదిలోకి దిగాడు. నీటి దగ్గర ఆఖరుమెట్టుమీద ఆగారు. అంతలో తనచేత ఉన్న ఆవిడచెయ్యి తీవ్రంగా వణకిపోతున్నట్టు తెలుసు కున్నాడు. అతడు ఒక్కసారి ఆమెకేసి చూశాడు. ఒక్క

సారి నిర్ఘాంతపోయాడు. ఆమె కళ్ళలో అనంతమైన బాధ, విషాదం ఒక్కసారిగా కనిపించేసరికి అదిరిపోయాడు. తన సర్వస్వం, తన ప్రేమధనం ఆమేకదా మరి.

"ఇంక ఆ అస్థికలపాత్రను గంగలోకి విసిరివేయండి. మీా భార్యాభర్తలు ఇద్దరూ చేతులు పట్టుకొని సరిగంగ స్నానాలు చేయండి," అంటూ క్రింద నీళ్ళలో మెట్లమీాద నిలుచున్న పురోహితుడు చెప్పాడు.

అస్థికల పాత్ర బుడుంగు మని మునిగిపోయింది. ఇద్దరూ మునిగారు. ఒక్క ఉదుటున తనచేయి విదల్చుకొని అర్థాంగి నదిలోకి చేయి జారిపోతున్నట్లు అనిపించింది అఖిలేశ్వరుడికి.

వెంటనే పెద్దగా కేకలువేస్తూ పైకి లేచాడు. మళ్లీ వెంటనేమునిగి ఆమెకోసం కాళ్ళతోనూ, చేతులతోనూ ఆదుర్దాగా జలగర్భం అంతా వెదకడం మొదలుపెట్టాడు. చీర కొంగు అయినా దొరుకుతుందేమో పట్టుకుని పైకి లాగివేద్దామనుకున్నాడు. కాని ఆ కంగారులో అతడు కాళ్ళక్రింద ఊబినంతా కలచివేశాడు. అది ముక్కులోకీ నోటిలోకి వెళ్లి అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసేసింది. అతనికి ఈత రాదు. అందుచేత లోతునీటి ప్రవాహంలోకి వెళ్ళడానికి భయం. మెల్లిగా తడుముకుంటూ మెట్లదగ్గరకువచ్చి మెట్టెక్కి కూర్చున్నాడు. నురగలు కక్కుతూ ప్రవహిస్తున్న

బురదనీటి ప్రవాహాన్నిచూచి అతడు భయపడిపోయాడు. ఒక్క-సారి గట్టిగా మూలిగి మెట్లకడ్డంగా పడిపోయాడు.

పురోహితుడు మెల్లగా మెట్లదగ్గరకు వచ్చాడు కాని ఒక్క-ఉదుటున నదిలోకి లంఘించలేదు. ఎలా దిగుతాడు? పట్టుతాపితా కట్టుకున్నాడాయెను మరి!

ఆమె శరీరం దొరకలేదు. గంగానదిలో కొట్టుకు పోయే అసంఖ్యాక మృతదేహాలలో ఆమెదీ ఒకటి.

"ఆమె సుమంగళిగా గంగామాయి ఒళ్ళో పడి పోయింది. అదృష్టవంతురాలు" అన్నాడు పురోహితుడు.

మామూలుగా అందరూ అనే ఓదార్పుమాటే ఇది. ఇది నది అపహసిస్తున్నట్టుగా నీటిమీద రెండు బుడగలు లేచి మళ్లీ కరిగిపోయాయి. దూరాన పడవవాడు పాటపాడాడు. సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చాడు. ఎండ మండిపోతోంది. కాని అఖిలేశ్వరుడికో, ఇవేమీ కన బడలేదు; ఇవేమీ వినబడలేదు. మిన్నువిరిగి మీదపడ్డట్లు అనిపించింది. సర్వమూ చీకటిమయమైపోయింది. మనిషి మూర్ఛపోయాడు.

ఆ చుట్టుప్రక్క-ల స్నానం చేస్తున్నవారు కొందరు ఏం జరిగిందో ఏమిటో అనే కుతూహలంతో అతని చుట్టూచేరి దడికట్టి నిలబడ్డారు. సాధారణంగా మణికర్ణికలో ఇలాంటి దృశ్యాలు సర్వసామాన్యం. ప్రవాహంచూసి కళ్ళు తిరిగి పడిపోయాడని తీర్మానించారు.

ఉన్నవాళ్ళలో కాస్త మంచివాడు ఒకడు అఖిలేశ్వరుడికి తిరిగి తెలివి తెప్పించుదామనే ఆశతో సపర్యలకు పూనుకున్నాడు. ఎక్కడి కక్కడే ఉంటారుకదా! ఈ మరణంవల్ల పావన వారణాసీనగరం చెన్నుదరగలేదు. ఇంతకీ చచ్చినవాళ్ళతో అంతా చస్తారా? వాళ్ళకోసం జీవితం ఆగుతుందా? నది యథాప్రకారం నిరంతరాయంగా ప్రవహిస్తూనే ఉంది.

---

# పదకొండు

క్రూరమృగం చేతిలో చిక్కుకు పోయినవాడివలె అఖిలేశ్వరుడు చలిపిడుగునలె వచ్చిపడ్డ ఈ ఆపదకు తట్టుకోలేకపోయాడు. వేయితాళ్ళ పొడుగున జ్వరం ముంచుకు వచ్చింది. వడ్లగింజ వేస్తే పేలాలగింజ అయ్యేటంత జ్వరం ఒకసారి. ఇంకొకసారి చెమటపోసి గజగజా వణకిపోయేవాడు. ఈ ప్రపంచం ధోరణే పోయింది. మతి మతిలో లేకుండా పోయింది. పక్క అంతా చొల్లుతో తడిసి ముద్దయి పోయింది. అందులో అఖిలేశ్వరుడు కుప్పగా పడి ఉన్నాడు. గదిగోడలు గోడలలా కనిపించడంలేదు. పైకప్పు కూలి, మీద పడిపోతున్నట్టు అనిపించింది. తానేమో అంతూ పంతూలేని ఒక ముళ్ళదోవ వెంట పడి పరుగెత్తుకుపోతున్నట్టు అనిపించింది. గాజుపెంకుల రోడ్డుమీద వట్టికాళ్ళతో పరుగెత్తినట్లు, కాళ్లు తెగి నెత్తురు ఓడిగలుకట్టి ప్రవహిస్తున్నట్లూ అనిపించింది. గుడ్లగూబ నెత్తిమీదకు వచ్చి అరిచింది. చిన్న చిన్న క్షుద్రజీవులు తన్ను వెన్నంటి అపహసించడం మొదలుపెట్టాయి. అలా పరుగెత్తుతుంటే మోకాళ్లు కొట్టుకొని ముందుకు బోర్లపడ్డాడు. దెబ్బలు తగిలాయి. ఆ దోవ అలా అలా పోయిపోయి చివరకు అఖాతంలో కలిసిపోయింది. ఇంతలో అతను మళ్లీ లేచాడు. ఎంతో తంటాలు పడ్డాడు.

మూలిగాడు. చల్లని చేతులు ఎవ్వరివో అతణ్ణి అందిపుచ్చు కున్నాయి. ఎవ్వరో ఆడువారి మెత్తని చేతులు అతనికి ఆసటగా నిలిచాయి. ఆ మగతలో అఖిలేశ్వరుడు అస్పష్టంగా మెల్లిగా గొణుక్కున్నాడు. "అస్థికలపాత్ర. అక్కడ బండి యిరుసుకు భద్రంగా కట్టింది.- ఓ-అదెలా మాయమై పోతుంది? అసంభవం. నిన్ను ఒంటరిగా వదలిపెట్టి వెళ్ళడం పొరపాటే. నువ్వు జడుసుకొని ఉంటావు. జగదా! నామీద కోపమా? చెప్పవూ...."

ఇదంతా ఇలా జరిగినందుకు పూజారి చాలా విచారించాడు. అఖిలేశ్వరుడిపని ఇలా అయినందుకు అతను విచారించడంలేదు. కష్టంవచ్చినప్పుడు ఇలా ఉండటం సహజమే.

అయితే సంధిలో అతడు గొణిగినమాటలు ఒకదానికొకటి సంబంధం లేనట్టు కనబడ్డా ఏదో అదృశ్యసంబంధం కనబడుతోంది. పదే పదే అస్తికలపాత్రనుగురించి పలవరిస్తున్నాడు. దానిని గంగలో కలపడంకోసమే కాదా అతను కాశీకి వచ్చింది! అందులో అసహజమేముంది? కాని ఆ పాత్ర మాయమవడం ఏమిటి? అని. అది ఎక్కడ మాయమైంది? ఎలా మాయమైంది? నిప్పులేనిచో పొగ రాజదు. అదేమిటో అంతు పట్టకుండా ఉంది.

మొదట్లో ఈ పలవరింతలను యాదాలాపంగా విన్నాడు. వాటిని అంత లెక్క చేయనేలేదు. కాని విన్న కొలదీ విచిత్రంగా తోచాయి. ఒకప్పుడు ఏదో బాధపడ

తాడు. ఇంకొకప్పుడు ఆ మాటలు గద్గదికంగా ఉంటాయి. ఇంకొకసారి బ్రతిమాలుతున్నట్టు, మరొకసారి ప్రోత్సహిస్తున్నట్టు ఉన్నాయి. గుండెలో ఏదో భయం పట్టుకుంది. తాను ఏకాకినై పోయినట్లు, ఎవ్వరూ తోడులేకుండా ఎడారిమధ్య చిక్కుకుపోయినట్టు, తనమీద చీకటిసముద్రం నిశ్శబ్దంగా విరుచుకు పడుతున్నట్లు భావించాడు. ఇంతలో ఒక గొంతు వినబడింది. ఏదో చెప్పడానికి ప్రయత్నించి, ఏదో అడ్డు పడగా మానివేసినట్లు, జ్ఞాపకం రానట్టు అనిపించింది. ఆ గొంతుక చెవులు వినలేని, బుర్ర అర్థంచేసుకోలేని, జీవి దయ్యమై ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నట్లు అనిపించింది. మామూలు మానవుడు సంధించినప్పుడు బ్రతికిఉండగానే దయ్యమై పోతాడుకదా!

# పన్నెండు

అఖిలేశ్వరుడు మెల్లిగా కోలుకున్నాడు. మనిషి మళ్లీ మనలో పడడానికి పదిహేను రోజులు పట్టింది. అంత వరకూ క్షణమొక యుగంగా గడిచింది. మనిషి వట్టి కంకాళమైపోయాడు. కులబ్రాహ్మణుడు ఉచ్ఛనీచాలు ఆలోచించకుండా అన్నిటికీ తానే అయి సకలోపచారాలూ చేసి పోయే ప్రాణాన్ని నిలబెట్టాడు. అఖిలేశ్వరుడు ఆయనకు తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు. ప్రాణదాతలని ప్రశంసించాడు.

"దానిదేముంది లెండి? మనలో మనం చేసుకోకపోతే ఇంకెవ్వరు చేస్తారు? మీకూ మాకూ స్నేహం ఈ నాటిదా? పాతికేళ్ళనుంచి మన కుటుంబాలకు స్నేహం. ఒకళ్ల కష్టసుఖాలు మరొకరికి మీకూ మాకూ తెలిసినంతగా ఇంకెవ్వరికీ తెలియవు. కాని మీకు తగిలిన దెబ్బలలోకెల్లా ఇదే గొప్ప దెబ్బ...మీ ఆవిడ..." ఆయనేదో పరామర్శ వాక్యాలు చెప్పబోయాడు.

అఖిలేశ్వరుడు బాధతో కళ్లు మూసుకున్నాడు. విరక్తిగా "ఏంచేస్తాం? అంతా అలా జరగాలసి ఉంది!" అన్నాడు.

"మీరేమో మీతండ్రిగారి అస్థికలను గంగలో నిక్షేపించడం అనే పవిత్రమైన పని పెట్టుకుని కాశీ వచ్చారు. కాని, భగవంతుడు మీ ఆవిణ్ణికూడా తీసుకు పోయాడు. మనం ఏం చేయగలం? ఇవాళ ఉండి రేపు పోయే వాళ్ళం. ఆయన సంకల్పానికి తలఒగ్గడం తప్ప? మీ ఆవిడ కేమి? అదృష్టవంతురాలు. గంగ ఒడ్డున, కాశీలో, గంగలో ప్రాణాలు వదిలే అదృష్టం అందరికీ లభిస్తుందా? 'కాశ్యాంతు మరణాన్ముక్తిః' కదా. కేవలం చచ్చిపోవడం కోసమే అనేకమంది కాశీపట్టణానికి వచ్చి ఆ పుణ్యాదినం కోసం ఆశతో కాచుకు కూర్చుంటారు. అంతే. కేవలం చావడం కోసమే వస్తారు."

"అయితే, నడియవ్వనంలో ఉన్నవాళ్లుకూడానా?" అన్నాడు అఖిలేశ్వరుడు విచారసూచకంగా. పురోహితుడు తటపటాయించాడు. కాని అంతలో వదిలే ఘటం కాదు. అస్తికలపాత్ర మాయం కావడాన్నిగురించి పూర్తిగా తెలుసుకోవాలనుకున్నాడు. అది తెలిసేవరకూ ఏమీ తోచకుండా పోయింది. అందుకని తెలివిగా అసలు విషయాన్ని మళ్ళీ కదిపాడు.

"అవునుగాని అబ్బాయీ! మొన్న నువ్వు జ్వరంతో సంధించి ప్రేలాపన చేసినపుడు......" బహుశా ఏదో ప్రేలిఉంటా ననిపించింది అఖిలేశ్వరుడికి. కాని ఆ

దుస్సంఘటనలు వేటినీ తలచుకోవడం అతనికి ఇష్టంలేదు. అందుచేత వినీ వినిపించుకోనట్టు ఊరుకున్నాడు.

"......... బండి ఇరుసుకు కట్టిన అస్థికల పాత్ర మాయం కావడాన్ని గురించి చాలా సేపు ఒక టే పలవరించావు. ఏమిటది!" పురోహితుడు ఇంక ఉండబట్టలేక పైకి అడిగేశాడు.

సంధిలో పలవరించిన దానిని గురించి జాగ్రదవస్థలో చెప్పకుండా ఉండడం ఎలాగ ? అందుచేత అఖిలేశ్వరుడు ఇష్టంలేకపోయినా, చెప్పడం మొదలు పెట్టాడు.

"ఔను, ఇరుసుకుకట్టిన అస్థికలపాత్రి ఉగ్గిలి తెగడంతో క్రిందపడిపోయింది. నేను దిగి వెళ్ళి వెతుక్కువచ్చాను."

"వెదకడానికి ఎంతసేపు పట్టింది ?"

"ఒక గంట పట్టిందనుకోండి."

"అప్పుడు మీ ఆవిడకూడా మీతో వెదకడానికి వచ్చిందా?"

"లేదు. బండిలోనే ఉండిపోయింది."

"ఓ, అలాగా !"

"నాతో ఆవిడకూడా ఎందుకురావడం? అర్ధరాత్రి వేళ, లేనిపోని అడ్డం."

''ఔను. ఔనౌను.''

''మీరు మనఊరు వెళ్లినతరువాతకూడా ఈ సంగతి ఎవ్వరితోటీ చెప్పకండి. మీకు పుణ్యముంటుంది. ఒకవేళ ఆ అస్థికలపాత్ర దొరకకపోయినా, ఒకవేళ అది పగిలిపోయి అస్థికలు రోడ్డు దుమ్ములో కలిసిపోయినా ఇంకేమైనాఉందా? అమ్మో! అనుకోవడానికే భయం వేస్తోంది. దేవుడి దయ వల్ల అంతా సవ్యంగానే జరిగిపోయింది గాని.''

''ఔను అంతా సవ్యంగానేజరిగిపోయింది. అన్నింటి కంటె ఆశ్చర్యకరమైన విశేషమేమంటే అది క్రిందపడి కూడా పగిలిపోకుండా ఉండడం. అందులోనూ మట్టిపాత్ర. కదలుతున్న బండినుంచి పడినా పగలకపోవడం నిజంగా విశేషమే.'' అన్నాడు పురోహితుడు.

''నిజమే. అదే గొప్పవిశేషం. భగవంతుడే దాన్ని పగిలిపోకుండా కాపాడి ఉండాలి.''

కాని పురోహితుడి దృష్టిలో భగవంతుడంటే ఇంకో భావం ఉన్నట్లుంది. ఈ జగన్నాటకంలో సూత్రధారి అయిన ఆ భగవంతుని చెయిదలను గురించి ఆయన తన అభిప్రాయాలను అప్పుడు వెల్లడించడం అంత సముచితం కాదనుకున్నాడు. నాలుగు పరకల పిలకముడి జార్చి, జాడించి, వేళ్ళతో చిక్కుదీసి మళ్ళీ గట్టిగా ముడివేసుకుంటూ ఒక వెడగు నవ్వు నవ్వాడు.

నిమజ్జనం

సంశయమే ఆధ్యాత్మిక జ్ఞానాభివృద్ధికి మొదటిమెట్టు. పురోహితుడికి వృత్తిని నిర్విఘ్నంగా జరుపుకోవడానికి చాలినంతగా ఆ విద్య తెలుసు. అయితే ప్రస్తుతం ఆయనకు వచ్చిన సందేహం ఆధ్యాత్మపరమైంది కాదు. ఆయనకు దేవుడన్నా దయ్యమన్నా, స్వర్గమన్నా నరకమన్నా నమ్మకమే. దైవభీతికలవాడు. కాని విశ్వాసాన్నీ, ఛాందసాన్నీ ఒకే గాటను కట్టివేయడానికి ఆయన సంసిద్ధుడుగా లేడు. ఆయన ఆధ్యాత్మ విద్యావాసనలన్నీ లౌకికమైనవి. తప్పటడుగులు వేయకుండా, కాలుజారకుండా కాలంగడుపుకు రావడం ఎలాగో ఆయనకు తెలుసు.

# పదమూడు

మళ్లీ తిరిగి వచ్చేసరికి తన్ను ఇంటికి తీసుకు వెళ్లడంకోసం బండివాడు స్టేషనుకు వచ్చి వేచి ఉంటాడని అఖిలేశ్వరుడు అనుకోలేదు. తను వస్తానన్న రోజుకు పదిహేను రోజుల తరువాత కూడా తనకోసం ఆ బండివాడు అలా వేచి ఉన్నాడంటే వాడి భక్తి శ్రద్ధలకు అఖిలేశ్వరుడు ఎంతో ఆశ్చర్య పడ్డాడు. బహుశా మొదటి ప్రయాణంలో తాను రూపాయి ఎక్కువ ఇచ్చినందుకే వాడు ఇప్పుడిలా వేచిఉన్నాడేమో నని భావించాడు.

బండివాడు కూడా అఖిలేశ్వరుణి వెంట మరొక పురుషుడు వచ్చినందుకు ఎంతో ఆశ్చర్యపడిపోయాడు. వాడి నోటివెంట మాటపెగ్లేదు. తెరచిననోరు తెరచినట్లే ఉండి పోయింది.

''నువ్వు ఎందుకు ఆశ్చర్య పడుతున్నావో నాకు తెలుసు. నేను అక్కడికి వెళ్లి జబ్బుపడ్డాను. పైగా...''అని ఇంకాఏదో చెప్పబోయాడు అఖిలేశ్వరుడు.

ఇంతలో కులబ్రాహ్మణుడు అఖిలేశ్వరుణ్ణి చేయి పట్టు, కుని గుంజుతూ ఈబండివాడితో ''సొదంతా చెప్పడం దేనికి?' అన్నట్టు చూశాడు. అఖిలేశ్వరుడు ఆయనకేసి తిరిగి ఇలా అన్నాడు—''చెప్పనియ్యండి. చెబితే వచ్చేనష్టం ఏమిటి ?

నేనే చెప్పడం మంచిది. మరొకరైనా చెప్పకపోరు. ఉన్న దానికి చిలవలు పలవలు కల్పించి భయంపుట్టించేటట్లు చెబు తారు. వచ్చేటప్పుడు మాకిద్దరికీ బండికట్టి స్టేషనుదాకా తీసుకువచ్చాడు కదా మరి!'' అంటూనే, బండివాడి కేసి—

''నాభార్య కాలంచేసింది. నదిలో స్నానంచేస్తుంటే కాలుజారిపడి కొట్టుకు పోయింది'' అన్నాడు.

''చచ్చిపోయిందా! నదిలో పడా!'' అని బండివాడు అదరిపడ్డాడు. వాడి ముఖంలో ఏదోభావం లీలగా కనిపిం చింది...స్టేషనులోని గుడ్డిదీపపు వెలుతురులో పురోహితు డంతా కనిపెట్టుతూనే ఉన్నాడు. ఈ వార్త వినగానే ఈ మోటు పశువు ముఖంలోకూడా ఇలాంటి సంచలనం కాన వచ్చినందుకు పురోహితు డెంతో ఆశ్చర్యపోయాడు....ఎంత నీచం! ఎంతనీచం! అనుకున్నాడు. ఏదో ఆలోచన తట్టేటప్ప టికి పురోహితుడి వళ్లు మండిపోయింది. కళ్లు ఎర్రబడ్డాయి.

''ఎద్దులను కట్టమంటూరా బాబూ?'' అని అడిగాడు అఖిలేశ్వరుణ్ణి బండివాడు. నున్నగా గొరిగించుకున్న గుండూ, బింకెబొజ్జా, పందికళ్లూ—ఆ బ్రాహ్మణుణ్ణిచూస్తే బండివాడి కెందుకో కోపం పుట్టుకు వచ్చింది, ఆయన కేసి కొరకొరా చూశాడు.

''కట్టు! తెల్లారేటప్పటికల్లా ఇంటికి తీసుకుపోవాలి. నేను ఇంటికి ఇలా ఒంటిగా తిరిగిరావడం ఎవ్వరికంటా పడ కూడదు. అది నా కిష్టంలేదు'' అన్నాడు అఖిలేశ్వరుడు.

# పదునాలుగు

ఎద్దులబండి మెల్లగా ముందుకు సాగుతోంది. దోవంట మరికొన్ని బళ్లు వెళ్ళుతున్నాయికాని, ఈ బండి త్వరలోనే వాటన్నింటిని దాటుకుపోయింది. ఆవేళ శుద్ధ తదియ. చుట్టూచిమ్మచీకటి. నక్షత్రాలు మెరుస్తున్నాయి. కాని, ఎక్కడా గాలి ఆడడంలేదు. సహ్యాద్రినుంచి మల పవనమూలేదు, అరేబియా సముద్రంనుంచి జల పవనమూ లేదు. ప్రకృతిఅంతా ఊపిరి బిగపట్టినట్లుంది. కొండ లను పరిహసించిన పర్వతమూ గుట్టలను పరిహసించిన కొండలూ, మైదానాన్ని పరిహసించిన గుట్టలూ అన్నీ కూడా చీకటిలో ఏకమైపోయాయి. ఆ నిశ్శబ్ద నిశీథంలో అంతా మాటుమణిగి పోయింది.

బండిలోపల తెగ ఉక్కపోస్తున్నది. దానికి తోడు వట్టి గడ్డివాసన. తనలో అంతులేని ఆవేదన, దరిలేని దుఃఖం. బయట అలముకున్న అంధకారం వంటిదికాదు అది. ఏదో హోమధూమం క్రిందికి దిగివచ్చి గడ్డబారి తన ఆత్మను బంధించివేసినట్లు బాధపడ్డాడు. అయితే అతణ్ణి అలము కున్న వైరాగ్య భావనలో అఖిలేశ్వరుడు తన ఆత్మను క్షోభను దనకేమీ సంబంధం లేనివాడివలె నిర్లిప్తంగా సంద ర్శించగలిగాడు. తన భార్య మరణించిందన్న నిర్భర

సత్యాన్ని తెలుసుకోగలిగాడు. పదునైన కత్తితో కోసి నప్పటిబాధతో కాక ఒకవిధమైన మొద్దుబారిన మనస్సుతో, వళ్ళంతా తిమ్మిరెక్కినట్లు తెలుసుకోగలిగాడు. తానూ చనిపోయినట్టే. అయితే దైవ దుర్విపాకంవల్ల తన బొందెలో ప్రాణం నిలిచింది. అంతే. తాను నడుస్తున్న కంకాళం. జీవచ్ఛవంవలె బ్రతికిఉన్నాడు. తల్లిలేని తన బిడ్డకు నామమాత్రావశిష్టుడైన తండ్రి. భార్యను కోలుపోయిన దుఃఖంలో అతనికి తెలిసివచ్చింది తన భార్యపట్ల తనకు అంత అనురాగం లేదని. అతడికి తన లోపాలు గోరంతలు కొండంతలుగా కనబడ్డాయి. తన దృష్టికి ఆమె మూర్తీభవించిన సౌజన్యరాశి మాత్రమే కాదు. కేవలం దేవతా మూర్తి. జీవితం అంటే మాటలుకాదని అతని అభిప్రాయం. కాని ఆ అభిప్రాయంలో ఉండడం చేతనే జీవితంయొక్క సమగ్రస్వరూపాన్ని అతడు చూడలేకపోయాడు. క్రమ బద్ధమైన దాని వికాసాన్ని గమనించలేకపోయాడు. అతడు తన ఆలోచనలలో ఎంతగా తన్మయుడైపోయాడంటే, తన ప్రక్కనే పడుకొని పురోహితుడు గుర్రుతీస్తున్నా అతనికి వినిపించలేదు. తాను బ్రతికి ఉన్నాడా అంటే బ్రతికి ఉన్నట్టూ కాదు. చచ్చినవాడా అంటే చచ్చినవాడూకాదు. అటూ ఇటూకాని పరిస్థితి తనది. అఖిలేశ్వరుడు ఈవిధంగా ఆలోచిస్తూ బండిలో కూర్చున్నాడు. బండి వెళ్ళుతోంటే రోడ్డు గతుకులమూలాన్ని కుదుపు చాలా హెచ్చుగా ఉంది. మెల్లిగా జోగి జోగి నిద్రలో కూరుకుపోయాడు. ఆలోచన

ల్లన్నీ ఆగిపోయాయి. ఈ స్థితిలో ఒక కల వచ్చింది. ఆ కల మృత్యువును ధిక్కరించి జీవితాన్ని ఉత్తేజపరుప గలిగినట్టిది. అందులో పాతకథ అంత పునరావృత్త మవుతోంది. జగదాంబ మళ్ళీ తన సరసనేఉన్నట్టూ, మళ్ళీ తామంతా తమ ఇంట్లో ఉన్నట్టూ,అక్కడ నవ్వుతూ, త్రుళ్లిపడుతూ, కేరింత లాడుతూ మామూలుగా పనిచేసుకుంటున్నట్టూ, ఇప్పుడు వంటింట్లో, ఇప్పుడు వసారాలో, ఇప్పుడు దొడ్డిలో, ఇంటిలో ప్రతిచోటా తానే తిరుగుతూ ఉన్నట్టూ కనిపించింది. ఎంతటి వినయం. ఎంతటి సౌశీల్యం. ఎంతటి లాలిత్యం! ఎంత హుందాగాఉండేది ఆవిడ. ఆ గతకాలపు కరుణ జ్యోతి ప్రాభాత కుసుమంవలె స్వచ్ఛమైంది. ఆమె అవతారమూర్తి. ఆమె తన మనిషినీ, మనసునూ అంటిన మురికిని పూర్తిగా కడిగివేసింది. ఈ ఆలోచనతో అతని మనస్సు అంతా ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. ఆనందాన్ని అతడు భరించలేకపోయాడు...

బండి వాడు తనచుట్టూ ఆవరించుకున్న చిమ్మచీకటి లోకి కళ్ళు చించుకుంటూ చూచాడు, చూచాడు. ఎద్దుల మెళ్ళో మువ్వలను, కొమ్ముల కలశాలనూ తీసిపారవేశాడు. వాడు మనిషి బాగా మారిపోయాడు. మొదట్లో ఎంతో హుషారుగా ఎల్లప్పుడూ నవ్వుతూఉండేవాడా, ఇప్పుడదేమీ లేదు. తొట్టెలో కూర్చున్న కాసేపూ మహారాజు ననుకుని మురిసిపోయే ఆ మనిషి ఇప్పుడు అంతులేని ఆలోచనా సముద్రంలో మునిగి పోయాడు. ఆచిమ్మచీకటిలో ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. కాళ్ళుచేతులు బిగుసుకుపోయి

బాధపెట్టుతున్నాయి, ఇంతలో ఏమి తట్టిందో, ఏమి భయం తోచిందో గాని, ఒక ఎద్దుతోక మెలిపెట్టి, దానిని గట్టిగా పళ్లగుచ్చుకునేటట్టు కరిచాడు. బండి చక్రాలు పెద్దగా, మోతచేసుకుంటూ ముందుకు గబగబా దొర్లిపోయాయి. ఈ వేగంమాటున వాడి వణుకు తగ్గింది. ఇలా ఒక మైలు దూరం పరుగెత్తినతరువాత ఎద్దులు అలసిపోయి మెల్లిగా మందకొడిగా నడవడం ప్రారంభించాయి. పోడారిపోయిన పెదవులను తడపడం కోసం బండివాడు చుట్ట ముట్టించుకుంటే బాగుండు ననుకున్నాడు. వెంటనే పగ్గాలు వదులుచేసి చంకన బెట్టి, నోటిలో చుట్టపెట్టుకుని తలవంచుకొని ముట్టించుకో బోతున్నాడు. ఇంతలో బండి గోతిలోపడిందో ఏమో ఒక పెద్దకుదుపు కుదిపినట్లయింది. దాంతో చుట్ట ముట్టించుకున్న వాడల్లా ఎవరో త్రోసినట్లు వెనక్కు పడిపోయాడు. చేతిలో అగ్గిపుల్ల ఆరిపోయింది. పగ్గాలు చంకలోనుంచి జారిపోయాయి. ఎద్దులను తిట్టుకుంటూ లేచి తల పైకెత్తి చూచేసరికి ఎదుట గుండా కనబడ్డదృశ్యం వాణ్ణి రోమ రోమాంచలాలకూ కుదిపి వేసింది. మనిషి నిస్త్రాణగా మూలుగుల్లోకంటా ముడుచుకు పోయాడు. బండియిరుసుకుకట్టిన పొగచూరిన దీపంతాలూకు గుడ్డివెలుతురులో మసక మసకగా ఒక ఆకారపు నీడ కదులుతున్నట్టు కనిపించింది. ఆ నీడను తాను ఇదివరకే చూచాడు. ఎద్దులూ చూచినట్టున్నాయి. అందుకేనేమో అవి బెదురుతున్నాయి. దానికేసే రెప్పార్పకుండా చూశాడు. చూస్తున్నకొద్దీ పైప్రాణాలు పైనే పోయినట్లు అనిపించింది.

చూస్తుండగా ఆ నీడ పైకివచ్చింది. కాడిమీదనుంచి, మేడి మీదనుంచి పోలుమీదుగా తనకేసే వస్తోంది. మిలమిలా మెరిసే విషాదసంభరితమైన కళ్లు, విరబోసిన జుత్తు, పిడికిలి ముడుస్తూ తెరుస్తూ, దెబ్బతిన్న పులుగువలె ఆర్తనాదం చేస్తూ తన మీదమీదకు వచ్చేస్తోంది. ఆ ఆర్తనాదం విన్నదే తడవుగా గుండెలు చీల్చివేసిన ట్టనిపించింది. "ఆవిడే! ఆవిడే!" భయంతో వణికిపోతూ రొప్పుకుంటూ అనుకున్నాడు. మీద మీదకు వస్తున్న ఆ నీడను దూరంగా తరిమివేయాలనే కోరికతో కొరడా ఝులిపించాడు. ఇంతలో ఎద్దులకు ఏమి అనిపించిందో కాని బుసలు కొట్టుకుంటూ బండిని వెనక్కి గెంటడం మొదలు పెట్టాయి. ఆ ఊపుకి ఆగలేక బండివాడు తొట్టిలోనుంచి తుళ్ళిపడ్డాడు. దబ్బున కుప్పగా కూలబడ్డాడు. ఎద్దులు ఒక్కసారిగా ఎగిరి ముందుకు దూకాయి. వాడి రొమ్ముమీదనుంచి బండిచక్రం బరువుగా దొర్లిపోయింది. ప్రక్కటెముకలూ, హృదయ కుహరము పిప్పి పిప్పి అయి పోయాయి.

ఇంత గొడవా అయిన తరువాత ఎద్దులు నిశ్చలంగా నిలబడ్డాయి.

ఈ గలభా అంతా చూచి అఖిలేశ్వరుడూ, కుల బ్రాహ్మణుడూ ప్రాణాలు అరిచేత పెట్టుకొని బండిలోనుంచి క్రిందకు దుమికారు. క్రిందికి దుమికి చూచేసరికి అంతా అయిపోయింది. బండివాడు రోడ్డుకి అడ్డంగా పడిఉన్నాడు. వాడి

తల చక్రానికి కొట్టుకున్నట్టుగా ఉంది. అఖిలేశ్వరుడు బండి ఇరుసుకు కట్టిన కిరసనాయిలు దీపాన్ని హడావుడిగా విప్పి, వణుకుతున్న చేతులతో పట్టుకొని దాని వెలుతురులో బండి వాడి శరీరాన్ని చూశాడు. పురోహితుడు మాత్రం తొణక కుండా బెణకకుండా ధైర్యం చిక్కబట్టుకొని మోకాళ్ళ మీద చేతులు పెట్టుకుని క్రిందకు వంగిచూచాడు. ఏమిటో, దేన్నిగురించో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు కనబడ్డాడు.

బండివాడు బిర్రబిగిసి పడి ఉన్నాడు. వాడు రొమ్ము అంతా నెత్తురు మడుగై పోయింది. సగం తెరచిన నోటివెంట బాధగా, కష్టంగా ఊపిరితీయడానికి ఆ జీవుడు చాలా కష్ట పడుతున్నాడు. కళ్ళు మూసుకునే ఉన్నాడు. ముఖం వికృ తమై-పోయింది.

అఖిలేశ్వరుడు వాణ్ణి ఎత్తి పైకి లేవదీయబోయాడు. ''వాణ్ణి ముట్టుకోకు'' అని పురోహితుడు వారించాడు.

బాధతో మూలుగుతూ బండివాడు అప్పుడే కళ్ళు తెరి చాడు. ఎవ్వరో తనమీదకు వంగి తన్ను పరీక్షగా చూస్తూ న్నట్టు లీలగా కనబడింది. శక్తిఅంతా కూడగట్టుకొని ఎవరో అని చూడగా ఆ చూస్తున్నది అఖిలేశ్వరుడని గుర్తు పట్టగలిగాడు. చేతులు నలుపుకుంటూ ఏదో మాట్లాడ డానికి ప్రయత్నించాడు.

"నేను - నేను-" అంతలో గొంతుకలో ఏదో అడ్డపడింది. ఏదో గొణుగుతున్నాడు.

"మాట్లాడు." అన్నాడు పురోహితుడు గద్దిస్తూ.

"అస్థికల ముంత - ఇరుసునుంచి..." ఆ తరువాత మాటలు వాడి గళంలోనే అణగిపోయాయి. గొంతుకలో మాట గొంతుకలోనే పూడిపోయింది. వాడితల భుజం మీదికి వాలిపోయింది.

ఏం జరిగిందో పురోహితుడికి వెంటనే అర్థమై పోయింది. అఖిలేశ్వరుడికేసి అనుకంపతోకూడిన కటాక్ష వీక్షణాన్ని బరపినాడు. కాని అది జుగుప్సకూడిన జాలి.

అది జాలియో, జుగుప్సయో పట్టించుకోకుండానే అఖిలేశ్వరుడు చుట్టూ కలయచూచాడు. అదే ఆ కుప్ప మీదే బండివాడు కూర్చొని చుట్ట కాల్చుకున్నాడు. అదే ఆ చెట్టు వెనకే తన భార్య ఒంటరిగా నిలుచుని ఉంది. ఆవిడ రూపం స్పష్టంగా కనబడుతూనే ఉంది. చక్రాలలాంటి ఆకర్ణాంత విశాల నేత్రాలు, ధనుస్సులను తలపింపజేసి సుదీర్ఘములైన కనుబొమ్మలు-అంతా ఆవిడరూపమే. అందమైన ఆ కళ్ళద్వారా ఆత్మయావత్తు సృష్టిసౌందర్యాన్ని సందర్శించి ఉండవచ్చు. ఆమె ముఖ కవళికలలో సారళ్యం, ఠీవి, ఆనందం, గర్వం, అనురాగం అన్నీ కనబడేవి కాని మొదటినుంచి చివరికంటా ఆవిడ ఎంతో అనురాగాతిశయాన్ని ప్రదర్శిస్తూనే ఉండేది, అన్నింటినీ మించి ఆ చెట్టుకు

అనుకుని ఆ సమయంలో ఆమెచూసిన చూపు ఇప్పటికీ అతని మనస్సును దహించివేస్తూనే ఉంది. ఇంతకీ ఆమె తనతో ఎందుకు మాట్లాడలేదు? ఆమె చెప్పలేకపోయిన ఆ సంగతేమిటి? ఇలా అనుకుంటూండగా అఖిలేశ్వరుడి కంటివెంట ఒక్కచుక్క కన్నీరు బుగ్గమీదకు కారింది. ఒక్క నిముషం మౌనంగా ఉన్నాడు. తత్వచింతన పెల్లుబుకగా ఆ మౌనం భంగమైపోయింది.

"కాశీలో మా ఆవిడ నదిలో ప్రమాదవశాత్తూ పడి మునిగి చనిపోయింది." అని తనలో తాను మెల్లగా గొణుగుకున్నాడు. "ఇప్పుడిక్కడ బండివాడు అర్థాంతరంగా, ఎడ్లు బెదరి పడదోయడంవల్ల చచ్చాడు. ఇంతకీ మేము ప్రయాణానికి బయలుదేరినప్పుడు అన్నీ అపశకునాలే వచ్చి ఉండాలి."

"నిజమే. అందుకు సందేహమేమి?" అన్నాడు కూడా ఉన్న కులబ్రాహ్మణుడు. వాళ్లు ఒకళ్లకేసి మరొకళ్లు అదోలా చూచుకున్నారు. వ్యంగ్యం, లౌకిక మర్మమెరుగని హృదయసారళ్యం ముందు నిలవలేక పారిపోయింది. అయితే శవం పాదాలదగ్గర రోడ్డుమీద అడ్డంగా పడ్డ దానినిచూచి ఎంతటి అవివేకి అయినా దాని స్వభావాన్ని పూర్తిగా అర్థం చేసుకోగలడని ఆ అమాయక హృదయం స్వగతంగా గొణిగింది. వారి చూపులు విడిపోయాయి. మళ్లా ఆ దృశ్యాన్ని చూస్తూ కలుసుకున్నాయి. అది పైనున్న

మామిడి కొమ్మలనుంచి రాలిన దోరముగ్గిన మామిడిపండు. దానిని ఒకవైపున చిలకో, ఉడతో కొట్టివేసింది. రెండో వైపు అంతా బాగానే ఉంది. ఎక్కడో దూరాన గుంటలో అట్టడుగుననున్న కప్ప ఒకటి రెండుసార్లు బెక బెక లాడింది. అంతే. ఆ తరువాత అంతటా నిశ్శబ్దం అలముకుంది.

Printed at the Hindu Press, Machilipatnam.

## తుది మాట

ప్రపంచ కథకుల్లో ప్రకృష్టస్థానం ప్రాపించినట్టి
పొరుగు కథకుని లేఖిని నుంచి జాలువారిన
ఆణిముత్యాల వంటి కథలన్నీ కూడా
కథాప్రియులైన ఆంధ్రులకు
అత్యంతం ఆదరణీయాలు



ఆయన ఎంతటివాడో, ఆయన కథలు ఎంతటివో
ఆచి తూచి చూపడానికి
ఇది
అచ్చమైన మచ్చు

